# సర్వేశ్వర శతకము



గ్రంథకర్త:

యథావాక్కుల అన్నమయ్య

సాధన గ్రంథమండలి, తెనాలి.

# సర్వేశ్వర శతకము

(విపుల పీఠిక లఘుటీక)

గ్రంథకర్త:

యథావాక్కుల అన్నమయ్య



ప్రకాశకులు:

సాధన గ్రంథమండలి, తెనాలి



వెల; రు. 4-00

సాధన గ్రంథ మండలివి

అంగీరస

# శంకర జయంతి

వాణీ ఆర్టు ప్రింటర్సు, తెనాలి.

7-5-1992

# ముందలి మాట

"హేతవే సర్వసిద్ధీనాం కలికల్మష కేతవే।
భవాబ్ధిసేతవే తుభ్యం నమోఽస్తు వృషకేతవే॥"

శివుడు ఆశుతోషుడు. 'ఆశు తుష్యతీతి-ఆశుతోషః' అనగా తొందరగా ప్రసన్నుడయ్యే దైవము-అని అర్థం. ఈ కారణ చేతనే ఉత్తరదేశంలో శివుని 'భోలే బాబా' (అమాయకుడైన స్వామి) అంటారు.

శివారాధనవల్లనే 'ఐశ్వర్యం. ఐశ్వర మిశ్వరా దిచ్ఛేత్' అని ఆర్యోక్తి. రావణాదుల మహైశ్వర్యానికి మూలం శివారాధనయే. ఏవిధమైన గ్రహదోషమున్నా నిత్యము శ్రీరుద్రపారాయణచేస్తే ఆదోషం యోగంగా మారుతుంది. అందువల్లనే శ్రీవైష్ణవులయందును విశ్వేశ్వరుని ఆరాధించేవారు ఎక్కువగానే కనిపిస్తూ ఉంటారు. 'శివం మహాభాగవతం స్మరామి' అని వారు చెప్పిన మాటయే. శివరూపియైన భగవంతుని సేవించేవారి సంఖ్య బహుళము.

'నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్'

—భాగవతము.

ఉమామహేశ్వరారాధనవల్లనే ఆమె శ్రీకృష్ణదేవునకు అర్థాంగి కాగలిగినది.

సాక్షాత్తు శ్రీకృష్ణదేవుడు ఉపమన్యునకు శిష్యుడై 'పాశుపతదీక్ష' వహించి శివారాధనచేసి - ప్రద్యుమ్నుని పుత్రునిగా బడసినట్లు భారతానుశాసన పర్వములో ఉన్నది.

అందరును ఎఱింగిన శివసహస్రనామ స్తోత్రము-ఉపమన్యుడు శ్రీకృష్ణునకు అనుగ్రహింపగా శ్రీకృష్ణదేవుడు ధర్మజున కెఱింగించిన దే.

ఇట్లు అనాదియై సర్వార్థసాధకమైన శివారాధనపై యథావాక్కుల అన్నమయ్య రచించిన ఈసర్వేశ్వరశతకము వేనవేలవెలుగులను గ్రుమ్మరించునదై యున్నది. ఈ శతకము ప్రౌఢగంభీరశైలిలో సాగినప్పటికి దీని పీఠిక లఘుటీక అర్థావగతియందు ఏర్పడే క్లేశాన్ని చాలవరకు నివారిస్తాయి.

ఈ సర్వేశ్వరశతకము ఈ రూపములో వెలుగులోనికి రావటానికి వట్టిచెఱుకూరు గ్రామవాస్తవ్యులు, వదాన్యులు శ్రీ రావి వెంకటసుబ్బయ్య, సీతారామమ్మ పుణ్యదంపతులు,వీరి కుమారులు కారకులు.వీరుచేసినఆర్థికసహాయముతో ముద్రింపబడిన ఈగ్రంథము శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునుల పాదపద్మములందు సమర్పింపబడినది.

రావివారి కుటుంబసభ్యులు సర్వేశ్వరుని కరుణకు పాత్రులై బహులైశ్వర్య (ఈశ్వర భావము) సంపన్నులై విరాజిల్లుగాక యని ఆశీర్వదించుచున్నాను.

అన్నమయ్య వ్రాసిన ఈ శతకం చక్కగా అభ్యసించిన పాఠకులకు భక్తిజ్ఞాన వైరాగ్య సంపత్తి సముపలబ్ధమై క్రమంగా అది సర్వత్ర శివానుభవరూప మహైశ్వర్యముగా పరిణమించు నని నా నిశ్చితాభిప్రాయము.

అంగీరస
శంకరజయంతి
తెనాలి, 1992

ఇట్లు
బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధనగ్రంథ మండలి.



# పీఠిక

త్రైలోక్య సంపదాలేఖ్య సముల్లేఖన భిత్తయే।
సచ్చిదానంద రూపాయ శివాయ బ్రహ్మణే నమః॥

గోడమీద బొమ్మలు చిత్రింపబడినట్లు ఈ ముల్లోకములు మొత్త మెవ్వనిమీద చిత్రింపబడి యున్నదో-సచ్చిదానందరూపియైన ఆ శివునకు పరబ్రహ్మమునకు నమస్కారము.

సర్వేశ్వరశతకకర్త యథావాక్కుల అన్నమయ్య. ఆయన ఆత్రేయసగోత్రోద్భవుడు. ఆరాధ్యబ్రాహ్మణుడు. వీరశైవుడు. దూదికొండ సోమేశ్వరారాధ్యుడు తన గురువని ఆయనయే చెప్పుకొనినాడు (131)

ఆదికవి నన్నపార్యుని గంటమునుండి ఆంధ్రమున మహాభారతమావిర్భవించిన పదునొకండవ శతాబ్దియందే శతక వాఙ్మయమునకును శ్రీకారము చుట్టబడినది.

అన్నమయ్య ఈ సర్వేశ్వరశతకమును శా.శ,1164లో రచించినట్లు చెప్పుకొనినాడు. (130) అనగా ఆయన క్రీ. శ. 13వ శతాబ్దమునకు జెందినవాడని విశదమగుచున్నది.

రాజమహేంద్రవరమునకు సమీపమున పట్టిసముఅను నొక యూరున్నది. ఇది ప్రసిద్ధమైన శివక్షేత్రము. ఇచట వీరభద్రేశ్వరుని ఆలయమున్నది. నిత్యము దూరదూరముల నుండి ఎందరో భక్తులు నేడును ఇచ్చటకు వచ్చి స్వామిని దర్శించి అర్చించి పోవుచుందురు.

పావనగోదావరి తీరమందున్న యీ పట్టిసము-అన్నమయ్యకు అభిజనము. ఈ వీరభద్రేశ్వరుడు ఆయనకు ఆరాధ్య దైవము. చిరకాలము అన్నమయ్య పట్టిసమందే తన శివారాధనను కొనసాగించి పరిణత ప్రజ్ఞుడయ్యెను.

ఒకనాడాయన శ్రీశైలక్షేత్రమున మల్లికార్జునస్వామి నారాధింపబోయెను. ఆనాడు దేశమున నేటివలె రాజమార్గములులేవు. ఎచటికైనను నడచుచు బోవలసినదే. అందున శ్రీశైలక్షేత్రము మహారణ్య మధ్యమందున్నది. యాత్రలకు ఆనాడు చాల సమయము పట్టెడిది.

అన్నమయ్య ఎటులో శ్రీశైలమునకు బోయి-పాతాళగంగయందు గ్రుంకి-మల్లికార్జునస్వామిని మనసార ఆరాధించుచు గొన్నాళ్ళుండి బయలుదేరెను.

తిరుగుప్రయాణములో అన్నమయ్య నిరంతర శివధ్యానపరాయణుడై-సర్వమును శివమయముగా అనుభవించుచు కృష్ణాతీరమునగల 'సత్రశాల' అను గ్రామమునకు జేరెను.

అచట 'మల్లికేశ్వరస్వామి' ఆలయమున్నది. అన్నమయ్యకు ఆ ప్రదేశము తపోయోగ్యభూమిగా దోచినది. ఆయన తన ప్రయాణమాపి నిత్యము కృష్ణానదిలో స్నానము జేయుచు మల్లికేశ్వరస్వామి నారాధించుచు - పరమ శివ ధ్యాన విలీనాంతరంగుడై అచట కొంతకాల ముండెను.

ఆ రోజులలో ఆయనకు సర్వేశ్వరశతక రచనపై కోర్కె పుట్టెను. ఆయన వీరశైవుడు. భక్తాగ్రగణ్యుడు. అందుచే ఆయన శతకరచనకు ఒక నియమము నేర్పరచుకొనెను.

శతకరచన కృష్ణానదీతీరమున సాగించెదను ప్రతి పద్యమును ఒక తాటియాకుపై లిఖించి దానిని కృష్ణలో బడవేసెదను. శివునకు నాపై ప్రసన్నతయున్నచో పద్యము ప్రవాహమున బడిపోక నాయొద్దకు తిరిగి వచ్చును. అట్లు వచ్చిన పద్యమును గ్రంథమున గూర్చెదను. నా యీ శతకరచన ముగియులోపల నేయొక పద్యమైనను నావద్దకు తిరిగిరాక ప్రవాహమున గొట్టుకొని పోయినచో నేను నాతల తరిగికొని మరణింతును-అన్నదే ఆ నియమము.

ఇట్టి భయంకరమైన నియమముతో-కృష్ణాతీరమున మెడకు గండకత్తెర వైచుకొని-తాటియాకులను-గంటమును దగ్గరబెట్టుకొని శివునకు నమస్కరించి అన్నమయ్య సర్వేశ్వరశతక రచనము నారంభించెను.

అన్నమయ్య కోర్కె తీరుచుండెను. నీటబడిన ఏపద్యమును గొట్టుకొని పోవుటలేదు. అతనివద్దకే తిరిగి వచ్చుచుండెను. తనపై శివునకు గల కరుణకు మనసున బొంగుచు అన్నమయ్య పద్యరచన సాగించుచుండెను.

'తరులం బువ్వులు' (87) అన్న పద్యమును రచించి అన్నమయ్య నీటబడవేసెను. అదేమో; ఆ పద్యము తిరిగి రాలేదు. ప్రవాహమున గొట్టుకొని పోయెను.

అన్నమయ్య శివుని ధ్యానించి తన తల నుత్తరించుకొనబోయెను. అంతలో ఒక వింతజరిగెను.

ఒక పసులకాపరి వచ్చి-అయ్యా! ఇదొక త్రాటియాకు. నాకు దొరికినది. దీనిమీద నేదో యున్నది. చూడుడని ఆకు నిచ్చెను.

తన మరణోద్యోగమును-విరమించి అన్నమయ్య ఆ ఆకును పరిశీలించెను. తాను బడవేసిన ఆకే. పద్యమును జదివెను. అది తాను రచించిన పద్యముకాదు. 'సర్వేశ్వరా'! అన్న మకుటముతోడనే ఉన్నది. తాను రచించిన పద్యముకంటె ఎంతో అర్థవంతముగా నున్నది.

అన్నమయ్య పసులకాపరికొరకు తలయెత్తిపరికించెను. కాని అచట నెవ్వరును లేరు. ఇది శివునిలీల, ఇది శివుని రచన. అని భావించి అన్నమయ్య మనసున నానందించుచు-మరణోద్యోగమును మాని శతకరచనము బూర్తిచేసెను.

అన్నమయ్య సర్వేశ్వరశతకరచనమునుగూర్చి ఇట్లొక కథ జనశ్రుతిలో నున్నది. హేతువాదులు దీనిని 'వట్టికల్పన' అని కొట్టివేయుదురు. ఏది ఏమైనను 'అన్నమయ్య శివుని కరుణకు బాత్రుడైన మహాభక్తుడు' అను విషయమునకీ కథ అద్దము పట్టుచున్నది.

**142** పద్యములున్న యీ శతకము ప్రౌఢగంభీర శైలిలో శివపారమ్యమును నిర్ద్వంద్వముగా బ్రకటించుచున్నది.

యథావాక్కులు :

యథా వాచోఽస్య తథా సర్వం భవిష్యతి. (ఎవని నోటవెలువడిన వాక్కు అసత్యముకాదో) అన్న అర్థము నిది సూచించుచున్నది.

'ఋషీణాం పునరార్యాణాం వాచ మర్థోనుధావతి' (భవభూతి.)సామాన్యుల వాక్కులు అర్థమునను సరించి ప్రవర్తిల్లును. ఋషుల వాక్కులను అర్థము అనుసరించును.

కాగా అన్నమయ్యయొక్క పూర్వులయందెవరో బ్రహ్మవిదులై గొప్ప తేజస్సామర్థ్యములను గడించి-'యథావాక్కులు' అన్న ఇంటిపేరుకు కారకులై యుందురని తోచుచున్నది. అనగా ఈ కవి బ్రహ్మవిదుల వంగడమున బుట్టిన భాగ్యశాలి.

వీరశైవము :

'విద్యాయాం శివరూపాయాం రమన్తే యే విశేషతః
తస్మాదేతే మహాభాగా వీరశైవా ఇతి స్మృతాః'
—సిద్ధాంత శిఖామణి.

'శివాత్ పరతరం నాస్తి' అని శివపారమ్యబుద్ధితో శివస్వరూప ప్రతిపాదకమైన విద్యయందు (మంత్రమందు) రమించు మహాభాగులు వీరశైవులు. 'విద్య+రమణము'- ఆద్యక్షరమాత్ర గ్రహణముచే 'విర'. అదియే సాగి 'వీర' అయినది.

శివపారమ్యము-ఆధారములు :

వీనికి కొదువలేదు.

మహేశ్వరే వా జగతామధీశ్వరే
జనార్దనే వా జగదంతరాత్మని।
న భేదబుద్ధి ప్రతిపత్తిరస్తిమే
తథాపి భక్తి స్తరుణేందుశేఖరే,॥ —భర్తృహరి.

'శివకేశవులకు నేను భేదమెంచను. కాని నాబుద్ధి శివునిపై మొగ్గుచూపుచున్నది' అన్నాడాయన.

యజుర్వేదములోని నమకమంత్రములు శివుని విశ్వాత్మకతను అద్దము పట్టుచున్న విషయము విద్వాన్మాత్రులకును లెస్స తెలిసినదే. ఇట్టి వనేకములు శివపారమ్యమునకు తార్కాణములు.

అందుచే 'శివాత్ పరతరం నాస్తి' అన్నమాట సుదృఢమైన ఆధారముతోడనే జనించినదనుట నిర్వివాదము. ఇంతకు 'ఎవని పెండ్లినాడు వాడు పల్లకి ఎక్కును' అన్నది యథార్థము. శివప్రతిపాదక గ్రంథములు శివుడే సర్వాధికుడని చెప్పును. ఇది ఆధారముగా హరివిరించులను (మనము) తక్కువగా భావించుట అదూరదర్శిత యగును.

లింగధారణము :

మూర్ధ్ని వా కంఠదేశేవా కక్షే వక్షః స్థలేఽపివా।
కుక్షౌ హస్తస్థలేవాపి ధారయేల్లింగ మైశ్వరమ్.॥
—సిద్ధాంత శిఖామణి.

శిరః-కంఠ-కక్ష-వక్షః- కుక్షి - హస్తములం దెచ్చట నైనను శివలింగమును ధరించవలెనని శాస్త్రవిధానము. అన్నమయ్య లింగధారి.

లింగనిర్వచనము :

'లయం గచ్ఛతి యత్రైతత్ జగత్సర్వం చరాచరం।
పునః పునః సముత్పత్తిం తల్లింగం బ్రహ్మ శాశ్వతమ్.॥'

'సర్వమునైన చరాచరజగము లెందు లీనములై మరల వినిర్గమించుచుండునో-అది లింగము' అని నిర్వచనము ('లీన+గమన' అనువాని ఆద్యక్షర గ్రహణవికారములు లింగశబ్ద సముత్పత్తికి కారణములు.)

లింగత్రైవిధ్యము :

స్థూల-సూక్ష్మ-పరాత్పరములని లింగములు ముివ్విధ ములుగా ఉత్తరోత్తరము ఉత్కర్ష కలిగియున్నవి. స్థూల లింగము-'స్ఫాటికం శైలజంవాపి చంద్రకాంత మథాపివా, బాణం వా సూర్యకాంతంవా....' అని స్ఫటిక-శిలా-చంద్ర కాంత-సూర్యకాంత-బాణాదులుగా బహువిధములైయున్నది

భక్తియుక్తమైన యోగసాధనచే సాధకహృదయమున జ్యోతీరూపము గోచరించును. అది సూక్ష్మలింగము. అదియే ప్రాణలింగము.

బ్రహ్మానుభవము పొంగి పొరలగా దన్నుదా మరచిన స్థితి పరాత్పరలింగము.

ఇందు ప్రథమోపాసనము ద్వితీయమునకు, ద్వితీ యము తృతీయమునకు చేర్చును,

అన్నమయ్య బ్రహ్మవిదుడు :

అన్నమయ్య ఈ తార్కిక యోగస్థితినందుకొన్న ఘనుడ నుటకు సర్వేశ్వరశతకములోని ప్రతి పద్యము తార్కాణమై యున్నది.

అందువలననే ఆయనమాటలు సూటిగా - వాడిగా రాజశాసనమువలె సాగినవి. ఈ విషయమును ఆయనయే- 'భయ విభ్రాంతులు లేక యీ శతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా!' (142) అని చెప్పుకొనినాడు.

మహేశుడు మాటలకందడుగదా! :

'యతో వాచో నివర్తన్తే-అప్రాప్య మనసా సహ' అని శ్రుతి - 'పరమేశ్వరుడు వాఙ్మానసములకు జిక్కువాడు కాదని' ఘోషించుచున్నది. 'అట్టివాని స్తుతించుటకు బూనుకొనుట అజ్ఞానముకాదా!' అన్న శంకను అన్నమయ్య-

జ్ఞానాతీతుడవైన నీమహిమఁ బ్రజ్ఞంబూని తర్కించుట
జ్ఞానాంగంబగు నైననుం దమ యథాశక్తిం బ్రశంసించి-ది
వ్యానందస్థితిఁ బొందువారిఁగని భక్త్యావృత్తి నిన్నెట్టివా
డైనం బ్రస్తుతి సేయుచుండు దనచేనైనంత సర్వేశ్వరా!

'స్వామీ! నీవు జ్ఞానాతీతుడవు. అయినను నిన్నెవ్వరైనను దమశక్తికొలది వినుతిసేసి ఆనందించుటయందు దోసములేదు'-అని ఆదియందే సమాధానించినాడు.

ఈపద్యము గంధర్వరాజైన పుష్పదంతుని మహిమ్న స్తోత్రమును తలపునకు దెచ్చుచున్నది. ఆయనకూడ తన స్తోత్రమునకు ఆరంభమున ఇట్లే చెప్పినాడు.

'మహిమ్నః పారంతే పరమవిదుషోయద్యసదృశీ
స్తుతిర్, బ్రహ్మాదీనా మపి తదవసన్నా స్త్వయి గిరః,
అథావాచ్యః సర్వః స్వమతి పరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హర నిరపవాదః పరికరః॥

స్వామీ! నీమహిమ పారములేనిది, అందుచే అది నా తెలివికి చిక్కనదికాదు. అట్లు తెలియని దానిని తెలుప నెంచు చున్నాను. అందుచే నాయత్నము అసమంజసముగా దోపవచ్చును.

కాని బ్రహ్మాదులు నిన్ను వినుతించినారుకదా। వారు మాత్రము నీమహిమను సంపూర్ణముగానెఱుంగగల్గిరా? లేదే!

అట్టియెడ వారొనర్చిన స్తుతులును అయుక్తములే కాదగును. కాని ఓ శివా! అనంతమైన నీ మహిమను తన బుద్ధి కందినంతవట్టు వినుతించుటలో తప్పేమున్నదయ్యా! ఆ ఊహతోడనే వారు ప్రవర్తించిరి. నేనును ప్రవర్తించు చున్నాను.' అనినాడు.

ఇటు అన్నమయ్య సర్వేశ్వరశతకము ప్రాచీనకవుల స్తోత్రములలోని భావములతోడను-వీరశైవ సాధన విశేషములతోడను పరిపుష్టమై యున్నది.

శివపారమ్యము :

అన్నమయ్య శివుడు సర్వదేవాధికుడని ఈ శతకము నందు పేర్కొనని చోటులేదు. ఆయన-

ఇన-విఘ్నేశ్వర-మాతృకా-ద్రుహిణ-బ్రాహ్మీ-స్కంద-
దుర్గా-రమా వనితాధీశ్వర భైరవుల్ బలిసి -- (5)....

స్వామీ! నిన్నర్చించియే నీ పరివారములో జేరి చెన్నొందుచున్నారు! అని శివపారమ్యమును నిస్సంకోచముగా ప్రకటించినాడు.

శివస్వరూపము :

ఏపాఱంగ నజాండ భాండ నికరం బేరూపునబుట్టి (6) అనుచు-జగదుత్పత్తి స్థితిలయము లెందు జరుగుచున్నవో, అదియే శివస్వరూపమని' అన్నమయ్య భ్రాంతిరహితముగా బల్కినాడు.

శివలింగము :

అన్నమయ్య దృష్టిలో శివలింగము శిలామాత్రము కాదు. సకల బ్రహ్మాండ భాండము లెద్దాని గర్భమున బుడగలవలె దోచి యణగారుచుండునో అది శివలింగము. బ్రహ్మాదులన్ననో అబుద్బుద గర్భముల వసించువారు. అట్టియెడ వారికి శివునితో సామ్యమెట్లు కుదురును ?

జలజాత ప్రభవాండబుద్బుదములశ్రాంతంబునుం బుట్టుచుం
గలయం గ్రాగుచునుండు నీపృథుల లింగస్ఫార గర్భాబ్ధిలో
పలఁ దద్బుద గర్భవాసులు హరి బ్రహ్మాది దేవాలియున్
గలదే వారికి నీమహత్త్వ మెఱుంగంగా శక్తి సర్వేశ్వరా!(7)

ఆజ్ఞాశక్తి ;

పరబ్రహ్మాభిన్నమైన మాయాశక్తి కారణముగా చరాచర సమస్త విశ్వసమూహము పుట్టి పెరిగి గిట్టుచున్నది. పరబ్రహ్మ సాన్నిధ్యమున మాయాశక్తి ఈ కార్యములొనర్చుచున్నది. బ్రహ్మము నేరుగా ఈ సృష్టి స్థితిలయములకు కర్త కాదు-అని అద్వైతసిద్ధాంతము.

అన్నమయ్య ఆ మాయాశక్తినే శివుని ఆజ్ఞాశక్తిగా బహుప్రకారముల వినుతించినాడు.

పవనుండై హిమధాముడై యనలుడై పానీయమై యాత్మయై
రవియై యంబరమై మహీవలయమై రమ్యాష్టమూర్తిక్రియన్
భువనాంగమ్ములు లక్షణాంగములుగా బుట్టించు నత్యద్భుతో
త్సవ లీలావిభవంబుతోడ భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా! (9)

ఇందు భూతపంచకము, సూర్యచంద్రులు, యజమానుడు శివునిరూపములే యని-శివుడు అష్టమూర్తియై యుండుటను గీర్తించి శివాదన్యము-శివాత్పరము లేవు లేవని నిర్ద్వంద్వముగా వక్కాణించినాడు.

దుష్టశిక్షణము శిష్టరక్షణము శివుని ఆజ్ఞాశక్తి కార్యములే అని కీర్తించినాడు. చూ. 10.

శివభక్తుడు-శివభక్తప్రశంస :

వీరశైవులు శివభక్తునకు శివునకు భేదము నెంచరు. పైగా శివుని కంటె శివభక్తునే అధికునిగా భావింతురు.

మృచ్ఛిలానిర్మితమైన స్థావరలింగముకంటె లోకమున నడ యాడు జంగమలింగము శ్రేష్ఠమే కదా!

జంగమలింగరూపులైన శివభక్తులను కవి బహు విధముల గీర్తించినాడు.

"శ్రీవత్సాంకు రమా విశేషతయు (21)—అనుచు-కవి హరి విరించులు, ఇంద్ర-సూర్య-మదనులు-వీరలవై భవము శివా! నీభక్తునకు తృణప్రాయము" అనినాడు.

భక్తుని పాదధూళి ముక్తిని బ్రసాదించుచుండగా-ఆ భక్తుడు చేతితో నిచ్చిన ప్రసాదభూతిని నొసటదాల్చిన వాని భాగ్యము నెవ్వరెన్నఁగలరు? అనియు (22)

పలు తీర్థంబుల గ్రుంకుకంటె నిలలో భక్తాంఘ్రిపానీయముల్ తలమీఁదం జిలికించుకొన్న శుచి....(23) అనియు

తీర్థములందెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా! (25) అనియు-భక్తమహత్త్వమును బహువిధముల బ్రశంసించినాడు.

సకల బ్రహ్మాండములును లింగగర్భమునందుండగా-లింగమును జంగమమహేశ్వరులు హృదయమున ధరించు చున్నారు. అందుచే వారిని బూజించుట సర్వమును బూజించుట, వారికి దృప్తి కలిగించుట సర్వమునకు దృప్తిసేయుట-అనినాడు. చూ. 31.

శివభక్తుఁ డెట్టివాఁడైనను బూజ్యుడే:

శివభక్తుడు వక్రమార్గమున నడచినను బూజ్యుడే-

"నిర్మల గంగా ప్రథుల ప్రవాహమరయం బ్రస్ఫూర్తి దానెన్ని వంకలుగా బాఱిన దాని నొందు వలుకంగా జన్నె సర్వేశ్వరా"-అని కవి చెప్పిన సామ్యము సహిప్రతిగా నున్నది.

బ్రహ్మాదులకంటె శివభక్తుడధికుడు :

తిన్నైన భక్తిచే శివసాలోక్యమునో, సారూప్యమునో చేకొన్న భక్తుడు బ్రహ్మేంద్రాదులకంటె అధికుడు-అనుచు అన్నమయ్య చూపిన హేతువును గాదనుశక్తి ఎవ్వరికిని లేదు. దీనికి బ్రహ్మయుర్దాయము తెలియవలెను.

దివసములు-వారములు-పక్షములు-మాసములు-సంవత్సరములు-ఇంతవరకు అందరకు తెలియును. ఇక మిగిలినవి యుగములు.

| | | |
|---|---|---|
| కలియుగము | 432000 | సం. ములు |
| ద్వాపరయుగము | 864000 | సం. ములు. |
| త్రేతాయుగము | 12,96000 | సం. ములు. |
| కృతయుగము | 17,28000 | సం. ములు. |

ఈ నాల్గుయుగముల మొత్తము ఒక మహాయుగము. ఈ మహాయుగములు రెండువేలు గడచిన బ్రహ్మకు ఒక రోజు గడచును. అట్టి ముప్పదిరోజులు ఆయనకు ఒక మాసము. అట్టివి పండ్రెండు నెలలు బ్రహ్మకు ఒక సంవత్సరము. అట్టి సం. ములు వంద గడువగా బ్రహ్మ తనపదవి

నుండి మారును. (ఇప్పుడున్న బ్రహ్మకు ఏబదియేండ్లు దాటి నవి. ద్వితీయపరార్థము సాగుచున్నది.)

సప్తర్షి-ఇంద్ర-మనువుల ఆయువు 71 మహా యుగములు మాత్రమే. అనగా ఒక బ్రహ్మ పగటిభాగము గడచు సరికి ఇంద్రులు పదునల్గురు మారుచుందురు.

శివుడన్ననో శాశ్వతుడు. అందుచే శివసాలోక్య సామీప్యములను జేకొన్న శివభక్తుడు అల్పాయుష్కులైన బ్రహ్మాదులకంటె అధికుడేకదా! అని అన్నమయ్య తిరుగు లేని వాదము.

రమణీయ క్షితిపాలు డింద్రుని చతుర్మాసక్రమా యుష్యుడా
యమ రేంద్రుండజునాడికాద్వయము వాడా బ్రహ్మయుపన్నిమే
షము వాడంచును వీరినెల్లనగు, నీసాలోక్య-సామీప్య స
త్తమ రాజ్యస్థితి పట్టభద్రుడగు సద్భక్తుండు సర్వేశ్వరా!(37)

శివభక్తుని మహిమ యిట్టిదగుటచేతనే-

'మర్త్యమునం బుట్టగ వాంఛసేయుదు రమర్త్యశ్రేణి సర్వేశ్వరా!' అని ఒక శంకకు సావకాశము లేకుండ ప్రవచించినాడు.

## శివభక్తులు నిష్కాములు :

శీలవతియైన సతి పతి సాంగత్యమునే కోరును. సొమ్ములు కోరదు. (వెలయాలివలె) అట్లే శివభక్తులు శివాదన్యమును వాంఛింపరు. అనినాడు. చూ. 45. ప.

శివయోగి-యోగసాధన :

శరీరమున 72 వేల నాడులున్నవి. దానియందు ఇడ-1 ఘడియ, 2 దేవతలు. పింగళ-సుషుమ్న అను మూడును ప్రధానములు. అందు సుషుమ్న సర్వాధిక మహాత్త్వము కలది. ఇది నెన్నుబాము నడుమ నున్నది.

శరీరమున దశవిధ వాయువులు పనిసేయుచుండును. వానిని నియమించిన ప్రాణశక్తి వృద్ధినెందును. ఆ ప్రాణ శక్తిని గురూపదిష్ట మార్గమున సుషుమ్నలో ప్రవేశపెట్టగా యోగి ఆనందసముద్రమున దేలియాడును.

అన్నమయ్య ఈ ఆనందమునందుకొన్న యోగసిద్ధుడు. అందువలననే ఈ యోగసాధనమును ప్రస్తుతించినాడు. చూ. 49.

శివభక్తునకు నియమములు :

శివభక్తుని బహువిధముల ప్రశంసించుటచే అన్నమయ్య అతడు స్వేచ్ఛాచారిగా ఉండుటకు అంగీకరించెననరాదు. నియమపాలనశీలియే శివానుగ్రహమునకు పాత్రము కాగలడని చెప్పినాడు.

సత్యంబెప్పుడు దప్పడేనియు దురాచారుండు గాడేని యూ
చిత్యం బేమరడేని దుర్జనుల గోష్ఠిం బొందడే భక్తసాం
గత్యం బాదట బాయడేని మదనగ్రస్తుండు గాడేని, నీ
భృత్యుం డాతడు మూడులోకములలో బెంపొందు
సర్వేశ్వరా ! (55)

శివభక్తి ప్రశంస :

అన్నమయ్య శివభక్తునేకాదు, శివభక్తిని గూడ బహుప్రకారముల గీర్తించినాడు.

శివభక్తి తల్లివలె భక్తుని బెంచును. వెజ్జువలె చికిత్స సేయును. తండ్రివలె అదలించును. దాతవలె అభీష్టములు ప్రసాదించును. అనినాడు. చూ. 56 ప.

శివభక్తి సంసారమన్న ఏనుగుపాలిటి సింహము. దేహాభిమానమన్న వృక్షమునకు గొడ్డలిపెట్టు. పాపములన్న కాఱుమబ్బులకు పెనుగాలిదెబ్బ-అనినాడు. చూ. 57 ప.

వేదనలు పెరిగినపుడు-వజ్రపంజరమై చేకొని దన్ను నెత్తికొను నీసద్భక్తి సర్వేశ్వరా ! అనినాడు.

'అరిషడ్వర్గముల విజృంభణమును అడంచి-ఇంద్రియములను జిక్కబట్టుకొన్న తత్త్వజ్ఞానికి గాక ఇతరునకు శివభక్తి ఉపయింపదు'-అనినాడు. చూ. 62 ప.

భక్తిలేని లింగారాధన జంగమారాధనలు 'శవశృంగారము' అని నిరసించినాడు. చూ. 64 ప.

కర్మ, జ్ఞాన-ధ్యాన-యోగములు భక్తిలేక సాగునవి కావు. అందుచే అన్నిట భక్తియోగమే మిన్న అనినాడు చూ. 65 ప.

సముద్ర ప్రయాణము :

సంసారమొక సముద్రము. దీనిని దాటుటకు తగు నావ కావలెను. నావయున్న చాలదు. తెఱచాప కావలెను. దానిని ఎత్తిపట్టుటకు స్తంభము కావలెను. అంతమాత్రమున ప్రయాణము సాగునా? అనుకూల మారుతము - మార్గ జ్ఞానము లేక ప్రయాణించుట ఎట్లు?

అన్నమయ్య ఇన్నిటిని సమకూర్చిపెట్టినాడు. శరీరమే నావ. హృదయమే తెఱచాపకొయ్య. ధ్యానము తెఱచాప. భక్తియే అనుకూల పవనము. ఇట్టీనావ జ్ఞానమార్గమున సాగగా స్వామీ! యీ సంసార సముద్రమును దాటి కడ జేరవచ్చును'-అని మిక్కిలి రమ్యముగా జెప్పినాడు.

తనరం గాయ వహిత్ర[1]మందు హృదయ స్తంభాభిసంస్థానమై
చను నీ ధ్యానపటంబునూల్కొలిపి భాస్వద్భక్తివాతాహతిన్
వినుత జ్ఞానపదంబు చేకొని సముద్వేగంబునన్ జీవుడీ
ఘన సంసార మహార్ణవంబు గడవంగ బాఱు సర్వేశ్వరా! 72

శైవంలో వైష్ణవము :

శైవము సోఽహం భావ ప్రధానము. వైష్ణవము దాసోఽహంభావ ప్రధానము.

పుట్టుచు చచ్చుచున్ మరలబుట్టుచు-చండాల సంసారంలో మోహాంధకారంలో చిక్కుకొన్నవాడు 'సోఽహం'

అంటే నీకు దూరం అవుతాను. అహంకారాన్ని వీడి దాసోహమంటే 'సోహం భావసిద్ధి' కలుగుతుంది అనినాడు. చూ. 72, 73.

శూరుడెవడు ? :

వైరివర్గమును బ్రేల్చినవాడు శూరుడా ? సింహమును బట్టినవాడా ? ఏన్గును వెన్కకు నెట్టినవాడా ? వజ్రముతో గొట్టినవాడా ? ఎవడు శూరుడు ?

అన్నమయ్య వీరెవరును శూరులు కారన్నాడు. చిత్తమును శివభక్తియుక్తముగా జిక్కబట్టినవాడే శూరుడు, అదే శౌర్యము అనినాడు.

చిత్తమును నిగ్రహించుమని ఎన్నో సాదృశ్యములతో చిత్తానికి ఎక్కేలా అన్నమయ్య బోధించేడు, చూ. 77.

నైష్కర్మ్యసిద్ధి :

నైష్కర్మ్యసిద్ధి అద్వైతసాధనలో చివరిమెట్టు. దానిని జేరుకొన్న సాధకుడు పరిణతుడై సర్వత్ర-సర్వదా బ్రహ్మాను భవములో మునిగి తేలుతూ విహితకర్మాచరణమునగూడ శ్రద్ధ వహింపడు.

శివభక్తి యీ సిద్ధిని చేకూరుస్తుంది-అని అన్నమయ్య చెప్పిన విధానం కమనీయంగా ఉంది.

'రెండు కఱ్ఱలను దెచ్చి రాపాడించు. అగ్ని పుడు తుంది. పుట్టిన అగ్ని ఆ రెండు కఱ్ఱలను దహించివేస్తుంది

కదా' అలాగే శరీరాన్ని శివునికొఱకైన కర్మాచరణములో రాపాడిస్తే శివభక్తిరూప వహ్ని జనిస్తుంది. ఆ—'చిద్భక్తి వహ్ని యుజ్జ్వలమై కాయము గర్మముం జెఱచు తత్త్వం బెన్న సర్వేశ్వరా!' అనినాడు.

ఉదయించిన శివభక్తి దేహాభిమానముతో బాటు కర్మాచరణమును గూడ కాల్చివేస్తుంది. అన్న యీ మాట అన్నమయ్యకుగల శివభక్తి ఎంత లోతైనదో-ఎంత సమున్నతమైనదో వెల్లడిస్తోంది.

ఇలా ఈ శతకములోని ప్రతి పద్యము ఒక అనర్ఘ రత్నమై ఉన్నది. ఆ రత్నకాంతుల వెంబడి సాగించిన ప్రయాణం జీవితాన్ని ఒక వెలుగుముద్దగా మారుస్తుంది-అనడానికి సందేహం లేదు.

విషయప్రధానములైన పురాణములు ఆవిర్భవించిన కాలములో ఆవిర్భవించిన ఈ సర్వేశ్వర శతకముకూడ విషయ ప్రధానముగానే సాగినది. అయినను శబ్దసౌందర్యము, సమాసముల కూర్పులోని నైపుణ్యము-స్వచ్ఛ గంగాప్రవాహ సుందరమైన శైలి, అప్రయత్నముగా దూసుకొనివచ్చిన అలంకారముల నైగనిగ్యము ఇందు అను పదము ప్రస్ఫుటముగా కానవస్తాయి.

కవి-వ్యాకరణాది లాక్షణిక నియమాలను ఉల్లంఘించిన తావులుకూడ లేకపోలేదు. కాని అవన్నీ ఆయనలో చెలరేగిన శివభక్తి ఝంఝామారుతంలో కొట్టుకొని పోయేయి. కవి దృష్టిలో వానికి ప్రాధాన్యం లేదు.

ఇది సర్వేశ్వర శతకము సర్వమునకు ఈశుడైన వాని నుద్దేశించి సాగినదగుటచే ఈ మకుటం కూడ చాల అన్వర్థమై ఉంది.

ముగించవలె ననుకొనుచునే మరల వ్రాయుచున్నాను. అన్నమయ్య శివ సంబోధనలు ఎంత అందమైనవి!

నగరాట్కోదండ సర్వేశ్వరా!

గౌరీలోచన నర్తకీనటన రంగస్థాన సర్వేశ్వరా!

కావ్యకుధర వ్యాపార సర్వేశ్వరా!

సంకల్పప్రభవ ప్రతాపవన భాస్వద్దావ సర్వేశ్వరా!

ఒక్కొక్కటి హృదయాన్ని పులకింపజేస్తోంది

శివునకు శివభక్తునకు భేదములేనట్లే 87, 88 పద్యాలలో ఏది శివకృతమో-ఏది శివభక్తుడైన అన్నమయ్య రచించినదో రమ్యతనుబట్టి వివేచించి చెప్పుట కష్టము. రెండును అంతసుందరముగా ఉన్నాయి. చూ. 87. 88.

అన్నమయ్య పద్యశైలిని తరువాతివారు చాలమంది అనుకరించినారనుటకు ఎన్నో నిదర్శనములు చూపవచ్చును.

శివతాదాత్మ్యముతో కవి చెప్పిన యీ శతకము ఆయనకే కాదు-పాఠకులకును పరమానందమును ప్రసాదించగలదై యున్నది.

సాధకభక్తులకీ శతకమెంతయో చేయూత నీయగలదనుటలో సందేహము లేదు.

తెనాలి
ఆంగీరస-చైత్రము

ఇట్లు;
బులుసు సూర్యప్రకాశ శాస్త్రి

# శివ పంచముఖ ధ్యానము

ఓంకారమంత్రసంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః।
కామదం మోక్షదం తస్మై నకారాయ నమోనమః॥

నమస్తే దేవదేవేశ నమస్తే పరమేశ్వర।
నమస్తే వృషభారూఢ నకారాయ నమోనమః॥

మహాదేవం మహాత్మానం మహాపాతక నాశనం।
మహాపాపహరం వందే మకారాయ నమోనమః॥

శివం శాంతం జగన్నాథం లోకానుగ్రహ కారణం।
శివ మేకం పరం వందే శికారాయ నమోనమః॥

వాహనం వృషభో యస్య వాసుకిః కంఠభూషణం।
వామే శక్తిధరం వందే వకారాయ నమోనమః॥

యత్ర కుత్ర స్థితం దేవం సర్వవ్యాపిన మీశ్వరం।
యల్లింగం పూజయే న్నిత్యం యకారాయ నమోనమః॥

ఈ స్తోత్రము త్రికాలములందును బఠించుటవలన
పంచాక్షరి మంత్రజపఫలము కలుగును.



శ్రీ కంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీపాద దివ్య ప్రభా
నీకోత్సారిత దేవతానిటల దుర్నిత్యక్షర ధ్వాంతుఁ జి
త్ప్రాప్తికామ్యాంగు నపాంగమాత్రరచిత బ్రహ్మాండ
సంఘాతు జం
ద్రాకల్పుం బ్రణుతింతు నిన్నుమది నాహ్లాదింతు సర్వేశ్వరా!

శ్రీ ర స్తు

# సర్వేశ్వర శతకము

శ్రీకంఠుం బరమేశు నవ్యయు నిజ
శ్రీ పాద దివ్య[1] ప్రభా
నీకోత్సా[2]రిత దేవతానిటల దు
ర్నీత్యక్షర ధ్వాంతుఁ జి
త్ప్రా[3]కామ్యాంగు నపాంగమాత్రరచిత
బ్రహ్మాండ సంఘాతు జం
ద్రాకల్పుం బ్రణుతింతు నిన్ను మది నా
హ్లాదింతు సర్వేశ్వరా ! 1.

మ. ఒక మాటీ సకలంబు నీమయముగా
నూహించుచు న్వేండి రొ
క్కొక మాటింతయు నీవుగావనుచు నే
యుక్తిం బ్రశంసింప నే

1. కాంతి పుంజము 2. తొలగింపబడినది 3. తలచినచోటకెల్లపోయిరాగలశక్తి

రక వేదంబులు చిక్కఁబడ్డవనినం
బ్రవ్యక్తమై యుండు భా
వకుఁడై నీ నిజరూప మిట్టిదన నె
వ్వండోపు సర్వేశ్వరా. 2.

శా. జ్ఞానాతీతుఁడవైన నీమహిమఁ బ్ర
జ్ఞం బూని తర్కించు ట
జ్ఞానాంగంబగు నైనము దమయథా
శక్తిం బ్రశంసించి ది
వ్యానందస్థితిఁ బొందువారిఁ గని భ
క్త్యావృత్తి నిన్నెట్టివాఁ
డైనం బ్రస్తుతిసేయుచుండుఁ దనచే
నైనంత సర్వేశ్వరా. 3.

మ. అమితాంభోజభవాండభాండనిలయం
బైయుండు నీయంతరం
గము పట్టెంతయొ దాని కింక బహిరం
గం బెట్టిదో సూక్ష్మత
త్త్వము దా నంతకుమీఁద నేమివిధమో
తా నిట్టి నీపెంపుమా
ర్గము నీకైన నచింత్య మెట్లొరుఁ డెఱుం
గజాలు సర్వేశ్వరా. 4.

మ. ఇనవిష్ణ్వీశ్వరమాతృకా ద్రు[1]హిణ బ్రా
హ్మీస్కం[2]ద దుర్గారమా
వనితాధీశ్వర భైరవుల్ బలసి భా
స్వద్భక్తిసంయుక్తి నీ
కనిశంబుం బరివారభృత్యనికరం
బైరన్న ని న్నెంకఁ గో
ల్వని వా రెవ్వ రజాండభాండములలో
వర్ణింప సర్వేశ్వరా. 5.

శా. ఏపారంగ నీజాండభాండనికరం
బేరూపులోఁ బుట్టి యు
ద్దీపించున్మఱి రూపులెల్ల సమసు
ప్తింబొంది యేరూపులో
లోపించుం గలయంగ నంతటికిఁ దా
లోనై విజృంభించి యే
రూపంబవ్యయమై వెలుంగు నది నీ
రూపంబు సర్వేశ్వరా. 6.

మ. జలజాతప్రభవాండబుద్బు[1]దము ల
శ్రాంతంబునుం బుట్టుచుం
గలయం గ్రాఁగుచునుండు నీవృథులలిం
గస్ఫారగర్భాబ్ధిలో

1. బ్రహ్మ 2. కుమారస్వామి 3. నీటిబుడగ

పలఁ దద్బుద్బుద గర్భవాసులు
హరిబ్రహ్మాది దేవాలియుం
గలదే వారికి నీమహత్త్వ మెఱుఁగం
గా శక్తి సర్వేశ్వరా. 7.

మ. భవదున్మేషవిజృంభణంబు పరికిం
పగా సరోజాత సం
భవుజన్మంబు భవన్నిమేషమమిత
బ్రహ్మాండకల్పాంతభై
రవసంక్షోభితమన్నఁ దక్కిన భవ
త్ప్రారంభ భూరిక్రియా
నివహం బెవ్వరు నేర్తురిట్టిదని వ
ర్ణింపంగ సర్వేశ్వరా. 8.

మ. పవనుండై హిమధాముఁడై యనలుఁడై
పానీయమైయాత్మయై
రవియై యంబరమై మహీతలయమై
రమ్యాష్టమూర్తిక్రియన్
భువనాండంబులు లక్షణాంగములుగాఁ
బుట్టించు నత్యద్భుతో
త్సవలీలావిభవంబుతోడ భవదా
జ్ఞాశక్తి సర్వేశ్వరా. 9.

మ. జలజాతప్రభవాండభాండములు దు
శ్చారిత్రులం బాత్రులం
జెలువై యుండ యథాప్రమాణములుగా
శిక్షింప రక్షింప ని
శ్చలలీలం బ్రభవించు రాజు భవదా
జ్ఞాశక్తిఁగా కింతవ
ట్టెలమిం జేకొని నిర్వహింప మఱి రా
జెవ్వండు సర్వేశ్వరా. 10.

శా. జ్ఞానజ్యోతి విజృంభమాణముగ నో
జన్ విష్ణువిధ్యాది దే
వానీకాత్మపదావళిం దవిలి నీ
వారంగ వారిం గళా
జ్ఞానప్రౌఢులఁ జేయుటన్ వెలఁయు
గా సర్వజ్ఞశబ్దంబు దా
నీనామాంకముగా విధించు నిగమా
నీకంబు సర్వేశ్వరా. 11.

మ. సురలన్మర్త్యసమూహిగా మనుజులన్
శోభిల్లు బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుం
గాఁ బుణ్యపాపాలిచేఁ

దిరుగ న్నైవ్వచుచు నీమహామహిమ శ్రీ
తిం బ్రహ్మాండంబునం
దరయన్ జీవుల నింద్రజాలములుగా
నాడించు సర్వేశ్వరా. 12.

మ. ఘనుఁడై యేచి దశాననుండు బలిమిం
గైలాసశైలేంద్ర మె
త్తినఁ దద్దానవనాథుఁ ద్రొక్కె నతఁడ
ర్థి న్మ్రొక్కినం గాచి ప్రా
క్తనశౌర్యాధికుఁ జేసె దుష్టు నణఁపం
గా శిష్టు రక్షింప రం
జనలో నెప్పుడు వేచియుండు భవదా
జ్ఞాశక్తి సర్వేశ్వరా. 13.

మ. తమకంబెత్తిన నాత్మజం గడు మదాం
ధవ్యాప్తి నేకాంతప
టమునం దెవ్వరుఁ గానకుండ గవయం
గాఁబోయి నీబాణఘా
తమునం బ్రహ్మభవుండు ద్రెళ్లెననినం
దాఁదప్పవర్తించి లో
కమునం దెవ్వరికింక నిన్ను నెఱుగం
గావచ్చు సర్వేశ్వరా. 14.

మ. పలుజన్మంబులఁ గూడఁబడ్డభవకుం
భద్ఘోరదుష్కర్మరా
సులుపైఁ గూలి సమస్తజీవులు వెసన్
శోషించుచున్నబ్బద్ధ దు
ర్బలులై చిక్కినఁ దద్భవాపహరణా
ర్థం బొప్పఁ బద్మోద్భవ
ప్రళయం బొక్కొకమాటు సేయుదు తుదిన్
భావింప సర్వేశ్వరా. 15.

మ. సుమహత్పద్మభవాండపంక్తుల లయ
క్షోభప్రతాపంబుతో
నిమిషార్థంబునఁ గ్రాంచి వెంపెసఁగు నీ
నేత్రానలజ్యోతి య
య్యమమీనాంకజలంధర త్రిపురదై
త్యాలి న్విజృంభించి భ
స్మముగాఁ జేయుట నిశ్చయింప నిది దా
శౌర్యంబె సర్వేశ్వరా. 16.

మ. అతిదక్షుం డగుదక్షుఁ డీజగములో
యాగంబు సల్లక్షణ
స్థితిగాఁ జేయుచునుండి మిమ్ము మదిను
ద్దేశింపమిం జేసి తా

హేతుఁ డయ్యెం దుదినట్టికార్యములుఁ బొం
దైయుండునే క[1]ర్త స
మ్మతితోఁ జేయని దుర్మదుండు మనునే
భావింప సర్వేశ్వరా. 17.

మ. జగతీచక్రముపాదఘట్టన నదృ
శ్యంబై ప్రవర్తింపఁగా
గగనం బంతయు బాహుమండల సమ
గ్రవ్యాప్తులం దద్భుతం
బుగ ఘూర్ణిల్ల నజాంత్యవేళల సము
ద్భూతాంగహారావళుల్
నిగుడం బొంగి నటింతు తాండవమహా
నృత్యంబు సర్వేశ్వరా. 18.

మ. అమరేంద్రాబ్జభవాళి కెన్నఁ దుది నీ
వాదిం బ్రసాదించు న
ర్థము సిద్ధించు చునుండుఁగాని సురమా
త్రుంగోరిన స్వైరికా
ర్యము సిద్ధింప దనేకమార్గములఁ బ్రా
రంభించిరే నిశ్చయా
ర్థముగా నీవ సమస్తకర్త వగుటం
దర్కింప సర్వేశ్వరా. 19.

---

1. యజమాని అనుమతితో

మ. అమరంగా స్ఫుటభక్తినాటకము భా
షాంగక్రియాంగాభిర
మ్యముగాఁ జూపిన మెచ్చి మీరిలబలే
యన్నంతకున్ యోనిగే
హాములన్ రూపులు వన్నెకొంచును నటుం
డై వచ్చి సంసారరం
గములోనం బహురూపమాడు వెలయంగా
జీవి సర్వేశ్వరా. 20.

శా. శ్రీవత్సాంకు రమావిశేషతయు వా
క్శ్రీనాథు చాతుర్యమున్
దేవాధీశ్వరు వైభవోన్నతియు నా
తిగ్మాంశు తేజంబు శ్రీ
దేవీనందమరూపవిభ్రమము చిం
తింపంగ నీభక్తిస
ద్భావాత్ముండగుపుణ్యమూర్తికిఁ దృణ
ప్రాయంబు సర్వేశ్వరా. 21.

మ. ఇల సద్భక్తులపాదధూళిపటలం
బేమర్త్య ఫాలంబునం
జెలుకున్ వాఁడపవర్గనాథుఁ డనినన్
సిద్ధంబుగా వారిని

ర్మలహస్తార్పితభూతిఁ బ్రీతినొసలా
రం బూయు విశ్వాసికిన్
ఫల మూహించి విధించి యెవ్వరికిఁజె
ప్పన్వచ్చు సర్వేశ్వరా. 22

మ. పలుతీర్థంబులఁ గ్రుంకుకంటెమహిలో
భక్తాంఘ్రిపానీయముల్
తలమీఁదం జిలికించుకొన్న శుచి తీ
ర్థం బాడ భారంబు త
త్ఫలమత్యల్పము భక్తపాదయుగళాం
భస్స్పర్శనిర్భరమై
యలరున్ శాశ్వతభుక్తిముక్తి ఫలదం
బై యుండు సర్వేశ్వరా. 23

మ. రమణన్ భక్తసమగ్రదర్శనము తీ
ర్థశ్రేణి, తద్గోష్ఠి తీ
ర్థము తద్దివ్యదయావలోకనము తీ
ర్థం బెన్నఁగా నిట్టి జం
గమతీర్థాంబుధి నోలలాడక వివే
కభ్రష్టులై పోయి లో
కములోఁ దీర్థములంచు నేఱులు సొఱం
గానేల సర్వేశ్వరా.. 24

2. నాటకము

మ. కమనీయంబగు సర్వతీర్థములు లిం
గంబున్నచో మూర్తిమం
తములై యొప్పుచునుండు లింగమును దా
త్పర్యంబుతో భక్తిగా
గ్రమములం దెప్పుడు నుండుఁగాన మహిలోఁ
దత్త్వార్థ మూహింపఁ దీ
ర్థములం దెల్లను దివ్యతీర్థము భవ
ద్భక్తుండు సర్వేశ్వరా. 25.

మ. ధరణిం దీర్థము లాడుకంటె నతిమో
దంబొప్ప యజ్ఞంబులం
బరఁగం జేయుటకంటె సువ్రతములో
ప్పన్ వేదశాస్త్రార్థత
త్పరుఁడై యాదటఁజల్పుకంటె మదిను
త్సాహించి నీభక్తిమ
త్పురుషశ్రేష్ఠులఁ బూజసేయుట మహా
పుణ్యంబు సర్వేశ్వరా 26.

మ. భవదీయామలతత్త్వనిర్ణయకళా
ప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠి సుఖవార్ధిలోనఁ గనువే
డ్కం దేలినంగాక యీ

భువిలో దీర్థజలంబులం గడిగినం
బోనేర్చునే ఘోరదు
ర్భవసంఘాకలితాత్మతామస మహా
పంకంబు సర్వేశ్వరా. 27.

మ. ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహా
స్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యంబగు దివ్యతీర్థములు భ
క్తింజూచిరే వారి దు
స్తరదోషంబులు వాయువన్న మఱి
సాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే నరులపా
పంబెల్ల సర్వేశ్వరా. 28.

మ. కని సద్భక్తుల కంతనంతఁ గడువే
డ్కన్ హృత్ప్రణామంబు సే
సినమాత్రం జెడు సర్వదోషములు త
చ్ఛ్రీపాదముల్ముట్టి ప్రో
క్షిన సర్వాంగసమగ్రశుద్ధి యగు భ
క్తిన్ వారికిం బ్రీతిచే
సినఁ దద్దివ్యదయావలోకనఘన
శ్రీలొందు సర్వేశ్వరా. 29.

మ. జలజాతప్రభవాచ్యుతాదులు మదిం
జర్చించి చర్చించి నీ
కలయాపారయలేక చిక్కులఁ బడం
గా నిన్ను హస్తార్పితా
మలకవ్యాప్తిఁ దెచ్చి యేర్పఱిచి సం
బంధించి చేకొన్న భ
క్తులశౌర్యంబుపమింప నెవ్వఁడు సమ
ర్థుండింక సర్వేశ్వరా. 30.

మ. అమరన్ భక్తగణాత్మమధ్యమము లిం
గావాస మాలింగమ
ధ్యమముం బద్మభవాండభాండనిలయం
బై యుండుటన్ భక్తతృ
ప్తి మహాలింగము తృప్తియై మహిమను
ద్దీపించుఁ దల్లింగతృ
ప్తిమహత్త్వంబున నీసమస్తముసు దృ
ప్తిం బొందు సర్వేశ్వరా. 31.

మ. అనురాగంబున నిన్నుఁజూచుఁ దలపో
యుం జొక్కుఁ గాంక్షించు వ
ర్ణనసేయందమకించు సిగ్గువిరియం
బ్రార్థించు శోషించు నం

తనిది[1] ధ్యానము దాల్చుఁ దన్ను మఱచుం
దానీదశావస్థలం
దనరంగా మది నిన్ను దక్కఁగొను స
ద్భక్తుండు సర్వేశ్వరా. 32.

మ. ఎలమిన్ భక్తుఁడు వక్రుఁడై నడిచెనే
నేపారంగా దానికిం
గలుషింపం గలహింపఁ గింకిరిపడం
గా దెట్టిచోనైన ని
ర్మలగంగాపృథులప్రవాహ మరయం బ్ర
స్ఫూర్తిఁ దానెన్ని వరి
కలుగాఁ బాఱిన దానినొండు వలుకం
గాఁ జన్నె సర్వేశ్వరా. 33.

మ. సికతాధామము నీకుఁ జేసి మదిలోఁ
జెన్నొంది క్రీడించు బా
లకులింద్రాధికులన్న నీగుడు ల
తిశ్లాఘ్నేష్టాదులన్
సుకుమారంబుగనెత్తి భూతలములో
శోభిల్లు వంశప్రదీ
పకుసౌభాగ్యము మాన మెవ్వరికిఁ జె
ప్పన్వచ్చు సర్వేశ్వరా. 34.

1. మరల మరల తలంచుట

మ. భవదభ్యర్చనవేళలన్ భవుల సం
పద్భ్రాంతులన్ దీనమా
నవులన్ విద్విషులన్ భవాతురుల స
న్మానించుటల్ సౌఖ్యము
ఖ్యవిహారేచ్ఛలు నీమహత్త్వములు ని
త్యానంద మూహించుచో
భువి నీభక్తులకాత్మలో విరసము
ల్పుట్టించు సర్వేశ్వరా. 35.

మ. కరుణం జేకొని కేని రౌరవపద
గ్రస్తాత్ము దేవేంద్రుఁగాఁ
బరఁగంజేయుదు రాత్మలో నలిగి కేం
బ్జగన్యా రౌరవో
త్కరపంక ప్రవిలీనకీటకముఁగాఁ
గల్పింతు రన్నట్టిచో
నరయన్ భక్తులశక్తి యొట్లు గుఱి
సేయవచ్చు సర్వేశ్వరా. 36.

మ. రమణీయక్షితిపాలుఁ డింద్రునిచతు
ర్మాసక్రమాయుష్యుఁడా
యమరేంద్రుం డజునా[1]డికాద్వయమువాఁ
డా బ్రహ్మ యున్మన్నిమే

షమువాఁ డంచును వీరి నెల్లనగు నీ
సాలోక్య సామీప్యస
త్తమరాజ్యస్థితిపట్టభద్రుఁ డగుస
ద్భక్తుండు సర్వేశ్వరా. 37.

మ. ప్రకటింపంగ సమస్తపాతకములం
బాపంగ నీపూజయం
దొకపుష్పాంశముచాలునన్న మహిలో
నూహింపఁగానీపదా
ర్చకు లేమార్గమునందు శుద్ధులు మదిం
జర్చింపఁ దద్దుర్గుణ
ప్రకరం బెన్నెడువాడు లోకములలోఁ
బాపిష్ఠి సర్వేశ్వరా. 38.

మ. తమ తేజంబుఁ దృణీకరించుచు సము
ద్యత్తేజులై మీఁదిలో
కములపైమన్ జరియించు నీయచలభ
క్తశ్రేష్ఠులంజూచి నె
య్యమునం దారును దద్విధంబునను ని
న్నర్చింపం నూహించి మ
ర్త్యమునంబుట్టఁగ వాంఛ సేయుదు రమ
ర్త్యశ్రేణి సర్వేశ్వరా. 39.

1. ఘుడియుం

మ. అమరన్ భక్తులకెల్ల నీవ హృదయం
బై యుండుట వ్వారి సౌ
ఖ్యము నీసౌఖ్యము వారికూర్మియు సమ
గ్రంబైన నీకూర్మి త
త్త్వము భావింపఁగ వారికోపము భవ
త్ప్రఖ్యాతరౌద్రప్రభా
వము దా వారలవాక్యనిర్ణయము నీ
వాక్యంబు సర్వేశ్వరా. 40.

మ. అవనిం బెన్నిధి భాగ్యహీనునకుఁ బ్ర
త్యక్షంబుగా కప్పడొం
డవ భాండాకృతిఁ దాల్చి మాటువడి మా
యావృత్తినున్నట్లు దా
భవదీయప్రతిబింబమూర్తియగున
ద్భక్తుండు సంసారదు
ర్వ్యవయసాయాత్ములకెల్లఁ గేవలనరుం
డై తోఁచు సర్వేశ్వరా. 41.

మ. క్షితిపై శ్వేతమునీంద్రుఁ జంప నలుకం
[1]కీనాశుఁ డేతెంచి నీ
యతికోపో జ్జ్వలనాహుతి న్మడిసెఁ ద
ధ్యం బేకనిష్ఠాసమ

1. యముఁడు

న్వితులంజేకొని భక్తవత్సలుఁడవై
నీవెప్పుడు న్గావఁగాఁ
బ్రతిపత్తావలి కెట్లు వారిదెసఁ జే
రన్వచ్చు సర్వేశ్వరా. 42.

శా. కింకం దన్నుఁ నదల్చి చక్రమునఁ దాఁ
గృష్ణుం డని న్వైచినం
బొంకంబొప్పఁగ దానిఁ దుత్తుమురుగాఁ
బోఁదట్టియుప్పొంగెని
శ్శంకాత్ముండు దధీచి శాశ్వతులు నీ
సద్భక్తు లూహింపఁగా
సంకల్పప్రభవప్రతాపవనభా
స్వద్దావ సర్వేశ్వరా. 43.

మ. ఘటదుగ్ధంబులు పేరుఁ[1] గాక వెలయం
గా నెంత తోడంటె న
న్నట దుగ్ధాంబుధి పేరునే జగములో
నల్పుండు దుస్సంగతిం
జటులాత్ముండగుఁగాక యెయ్యెడల నీ
సద్భక్తుఁడేకార్యము
త్కటమై తాఁకిన నన్యచిత్తుఁడగునే
తర్కింప సర్వేశ్వరా. 44.

---

1. తోడుకొనవచ్చును

మ. సతి వేడ్కం దనప్రాణవల్లభునితో
సంయోగమర్థించుఁగా
కతనిం బ్రార్థనసేసి సొమ్ము గొనిపో
నట్లాడునే భక్తుఁడీ
క్షితి నీభక్తియ వేఁడుఁగాక మఱి నీ
శ్రీపాదముల్గొల్చి కు
చ్చితకామ్యార్థము లొండు వేఁడుకొనునే
చింతింప సర్వేశ్వరా. 45.

మ. భ్రమరధ్యానము దాల్చి కీటకము స
ద్భావాదిసంయుక్తిఁ దా
భ్రమరంబై ఖ[1]గవీథి నాడుననిన
న్నాటించి నిన్నాత్మ నె
య్యముతో ధ్యానముసేయు మర్త్యుఁడును నీ
యట్లే వరవ్యోమత
త్త్వమునం దవ్యయలీల నుండుటరుదే
భావింప సర్వేశ్వరా. 46.

మ. అమరశ్రేణులకు న్సుధామ[2]యకళౌ
ఘాత్మీయసారంబు ర
మ్యముగాఁ గ్రోలఁగనిచ్చి తానొకకళా
మాత్రాంగుఁడై యున్న చం

1. ఆకాశము 2. పదునారవది తప్ప మిగిలిన చంద్రకళలన్నియు దేవతలచే నారగింప బడుచుండును.

ద్రమునిం జూచి జగమ్ము మ్రొక్కఁ గతినా
రన్ భక్తపూజావిధి
క్రమభావాకృతుఁ జూచి మ్రొక్కుదురులో
కంబెల్ల సర్వేశ్వరా. 47.

మ. చెదరంబాఱు దశ[1] ప్రభంజనములన్
శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చలింపకుండ శశి[2] న
ర్కుఁ గట్టి భాస్వన్మన
స్సదనస్థానమునందు నిన్నెలమి సం
స్థాప్యంబుగాఁ జేసి తా
హృదయానందరసాబ్ధిఁ దేలు శివయో
గీంద్రుండు సర్వేశ్వరా. 48.

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహా
విస్పష్టమై యాత్మలో
పల భావించిన నీస్వరూపమె మహా
ప్రవ్యక్తమై దృష్టులం
దలఁపం జేకొనియున్న నీయచలిత
ధ్యానంబునం జేసి తాఁ
గలనైన న్శివయోగి తన్ను జగముం
గానండు సర్వేశ్వరా. 49.

---

1. ప్రాణ, అపాన-వ్యాన-ఉదాన-సమాన-నాగ-కూర్మ-కృకర-దేవదత్త-ధనంజయములని దశవాయువులు. 2. ఇడాపింగళలను నియమించి.

మ. భవదాకారమె కాంచు నీస్తవక
దంబశ్రేష్ఠద్వాక్యముల్
చెవులారన్ విను నిన్నె చెప్పు మది దు
శ్శీలేంద్రియాటోప దు
ర్వ్యవస్థాయాత్ములఁ గాంచుచో వినెడిచో
వర్ణించుచోఁ జీఁకునుం
జెవిటి న్మూఁగయునై చరించు మహి
నీశీలుండు సర్వేశ్వరా. 50.

మ. అతిలాలిత్యముగా నహర్నిశము ని
న్నర్చింపఁగా వచ్చు సు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెల్లకళలు
బ్రౌఢుండు గావచ్చు వా
క్పతి గానైనను వచ్చు గాని మఱి నీ
భక్తుండు గారాదు సు
స్థితిగా నీదయలేనిమానవునకుం
జింతింప సర్వేశ్వరా. 51.

మ. భవికిన్ భక్తిమహత్త్వ మంకురితమై
పాటిల్ల భక్తుండు బాం
ధవమాత్రుండగు భక్తి పుష్పితముగాఁ
దద్భక్తుఁ డాత్మేశుఁడై

సవిశేషస్థితిఁదోఁచుఁ భక్తి సఫలో
త్సాహంబునుం బొందఁగా
నవికల్పస్థితి నంత భక్తుఁడును నీ
వై యుండు సర్వేశ్వరా. 52.

మ. సుముఖుండై శివయోగి మోదము మదిన్
శోభిల్లఁ జేకొన్న భి
క్షము విప్రోత్తమకోటిభోజనసదృ[1]
క్షం బన్న సౌభాగ్యయో
గమునం దారయ నమ్మహామహుఁడు వే
డ్కం గోరి యారోగి[2]ణం
బమరం జేసినపుణ్య మెట్లు గుఱిసే
య న్వచ్చు సర్వేశ్వరా. 53.

శా. ఎచ్చో నీపదభక్తుఁడుండు మదినిం
బెక్కుం బ్రయత్నంబుతో
నచ్చో నీవనిశంబు నుండుదు త్వదీ
యధ్యానచిన్మూర్తులై
యచ్చో సన్మునులెల్ల నుండుదురు మం
త్రాంగాక్షరాయుక్తులై
యచ్చోఁ దీర్థములెల్ల నుండు నిది వే
దార్థంబు సర్వేశ్వరా. 54.

1. సమానము 2. భోజనము.

శా. సత్యం బెప్పుడుఁ దప్పఁడేనియు దురా
చారుండు గాఁడేని యా
చిత్యం బేమఱఁడేని దుర్జనుల గో
ష్ఠిం బొందఁడే భక్తసాం
గత్యం బాదటఁ బాయఁడేని మదన
గ్రస్తుండు గాఁడేని నీ
భృత్యుం డాతఁడు మూఁడులోకములలోఁ
బెంపొందు సర్వేశ్వరా. 55.

శా. పెంపం దల్లియగున్ రు[1]జాపటలదు
ష్పీడావిధిక్షోభ వా
రింపన్ వైద్యుఁ డగుం గుమార్గవిఘులం
గ్రీడింపఁబోకుండ శి
క్షింపన్ బల్లిదుఁడైన తండ్రియగుచున్
శ్రీమంతుఁగా నెంతయున్
సంపద్వృద్ధి యొనర్ప దాతయగు నీ
సద్భక్తి సర్వేశ్వరా. 56.

మ. ఉరుసంసార గజేంద్రదర్ప దళన
వ్యాఘ్ర ప్రతాపోగ్ర కే
సరి దుష్ప్రాప శరీరబంధ విపుల
వ్యాజ ప్రజచ్ఛేద ని

1. రోగము

స్ఫురితక్రూర[1] కుఠారధార దురిత
ప్రోద్ఘాత జీమూత[2]దు
స్తర సంఘాత విఘాత మారుతము నీ
సద్భక్తి సర్వేశ్వరా. 57.

మ. అరివీరప్రకరంబు భీకరతరం
బై తాఁకుచో సింహసిం
ధుర శార్దూల మృగోరగాది భయము
ల్దోతెంచుచో ఘోర (రోగ) దు
స్తర సంసారవికార వేదనలు మీఁ
దంబర్వుచో వజ్రపం
జరమై చేకొని తన్ను నెత్తుకొను నీ
సద్భక్తి సర్వేశ్వరా. 58.

మ. కమలా[1]ప్తుండుదయింపఁగా ననల[2]న
క్షత్ర క్షపా[3]ధీశతే
జములెల్లం బెడఁబాసిపోవుగతి నీ
సద్భక్తి భావంబు చి
త్తములోనం బ్రభవింపఁగా నితరమం
త్రధ్యాన తద్దేవతా
క్రమమాయాపటలంబు లన్నియును వీఁ
కం గ్రాఁగు సర్వేశ్వరా. 59.

1. గొడ్డలిపదను 2. మేఘము. 3. సూర్యుడు 4. అగ్ని 5. చంద్రుడు.

మ. చటులప్రాయ గుణేంద్రియాత్మలకు వాం
ఛావృత్తి నీభక్తి సం
స్ఫుటమైయుండదు భక్తితత్పరులకుం
బాల్పొందఁగాఁ జిత్తము
త్కటదుష్టేంద్రియవర్గ తామసపరి
గ్రస్తంబుగా దెట్లు చీఁ
కటికిం దిగ్మ[1]మరీచికిం గలదె సాం
గత్యంబు సర్వేశ్వరా. 60.

మ. బలవంతుండును దుర్బలుండును మహా
ప్రౌఢుండు మూఢుండునుం
గులహీనాత్మకుఁడున్ మహాకులజుఁడున్
గ్రూరుండు శాంతాతి ని
శ్చలచిత్తుండును నొక్కరూప మది నీ
సద్భక్తి చిత్తంబులో
పల వర్తిల్లినమీఁద నేవిధమునన్
భావింప సర్వేశ్వరా. 61.

శా. కామోద్రేకవిజృంభణంబును సమ
గ్రక్రోధమున్ లోభమున్
వ్యామోహంబు మదంబు మచ్చరము దీ
ప్రంబైన పంచేంద్రియో

1. సూర్యుఁడు

ద్దామాటోపము గ్రాఁచి పెంపెసఁగు త
త్త్వజ్ఞానికిం గాక తా
సామాన్యాత్ముల కేల నూలుకొను నీ
సద్భక్తి సర్వేశ్వరా. 62.

మ. ఉరుపక్షంబు[1]లు వచ్చునంతకు నిరు
ద్యోగంబున న్వృక్షకో[2]
టరమధ్యంబున నుండు పక్షి గతి ని
ష్ఠం గూర్చి(డి) నీభక్తి వి
స్తరమాత్మం బ్రభవించునంతకును నీ
సంసారకారాగృహాం
తరగేహంబుననుండి జీవుఁ డతివం
తం బొందు సర్వేశ్వరా. 63.

శా. లింగారాధన జంగమార్చనము లో
లిన్ భక్తి కంగంబు ప్రా
ణాంగవ్యాప్తియునై స్ఫురించు నిది త
త్త్వార్థంబగుం గాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుం
డై చేసినం దా శివ
శ్రృంగారంబగు వానిభక్తి మదిఁ జ
ర్చింపంగ సర్వేశ్వరా. 64.

---

1. పెక్కలు 2. తొఱ్ఱ

మ. ధరణిం గర్మవిధాన భక్తివిభవ
ధ్యా నోత్తమ జ్ఞానముల్
వరుసం బేర్కొను నాల్గుయోగములు త
త్త్వం బెంచు నీభక్తి వి
స్తరబాహ్యక్రియ లెల్లఁ బొల్లులగుటం
దద్భక్తియోగంబు తాఁ
బరఁగం దక్కిన మూఁడుయోగములకుం
బ్రాణంబు సర్వేశ్వరా. 65.

మ. అమరంగా ధన మిచ్చి కాతురు మహీయః
ప్రీతిఁ బ్రాణంబుఁ బ్రా
ణము నర్థంబును నిచ్చి కాతు రభిమా
నంబు న్విశేషించి మా
నముఁ బ్రాణంబును నర్థము న్నొసఁగి స
న్మానంబుగా నుత్తమో
త్తమచారిత్రులు భక్తిఁ గాతురు ప్రమో
దంబంది సర్వేశ్వరా. 66.

మ. అనుబద్ధేంద్రియభూతవర్గము యమా
ద్యష్టాంగమంత్రోరుసా
ధన నుచ్చాటనసేసి పాపి గురుస
ద్వాక్య ప్రకాశోత్తమాం

జనదృష్టిం బరికించి యేర్పఱిచి వాం
ఛం గోరి సాధించి చే
కొను చిన్మాత్రికిఁగాని భక్తినిధి గీ
ల్కొండెందు సర్వేశ్వరా. 67.

మ. కనకంబందు ఘనీభవించిన కళం
కంబెల్ల సువ్యక్తిగా
ననలాస్యంబునఁ గ్రాఁగిపోవుగతి జీ
వాత్మం బ్రవేశించి చే
కొని వర్తించిన దుర్మలత్రయపరి
క్షోభంబు నీభక్తిచే
తను బాపంబడుంగాని వేఱొకటిచే
తం బోదు సర్వేశ్వరా. 68.

మ. అమరంగా గురుమంత్రకార్ముకమునం
దాత్మాస్త్ర మష్టాంగయో
గమహాముష్టివివేకి యేయుటయుఁ ద
త్కాండం[1] బజాండాది త
త్త్వములెల్ల న్వడి గ్రుచ్చి పాఱి భవను
ద్యత్తూష్ణికైవల్యల
క్ష్యమునం దద్భుతశక్తితోడఁ గమియం
గానాటు సర్వేశ్వరా. 69.

1. బాణము

మ. తనరం గాయవహి[1]త్రమందు హృదయ
స్తంభాభిసంస్థానమై
చను నీధ్యానపటంబు నూల్కొలిపి భా
స్వద్భక్తి వాతాహతిన్
వినుతజ్ఞానపథంబు చేకొని సము
ద్వేగంబునన్ జీవుఁ డీ
ఘనసంసారమహార్ణవంబుఁ గడవం
గాఁ బాలు సర్వేశ్వరా. 70.

మ. అకలంకస్థిరభక్తి మున్పొగయ ని
శ్చ[2]ంతముం జూచి పా
యక పూజించు మహామహుండు భవద
భ్యర్చ్యుం డగుంగాక దా
సకలేచ్ఛావిషయంబులం బొరయుచుం
జాపల్యతం జేయు నా
బక[3]వేషార్చనలేల నిన్ను సొగయిం
పం జాలు సర్వేశ్వరా. 71.

మ. సమదో(రో)త్సాహసుఖాభిలాషులును నీ
సంసారమాయావినో
దములు స్స్వర్గఫలాపవర్గఫలచి
త్రభ్రాంతులుం బ్రాజ్యరా

1. నావ 2. ఎల్లప్పుడు 3. కొంగజపాలు

జ్యమహాకాంక్షలు నెన్నచూడ నివి నీ
సద్భక్తి కత్యంతరా[1]
యములై మాటికిమాటి కడ్డుపడఁ గా[2]
మ్యశ్రేణి సర్వేశ్వరా. 72

శా. మోహధ్వాంతములో మునింగిన మహా
మూఢుం డతిభ్రష్టుఁడై
సోఽహం[3] బంచుఁ దొడంగి నీకుఁ గడు దూ
రాత్ముం డగుంగాని దు
ష్టాహంకారగుణంబు మాని మది సోం
పారంగ సద్భక్తి దా
సోహం బన్న భవత్పదార్చకుఁడు నీ
వైయుండు సర్వేశ్వరా. 73.

శా. చావం బుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహా
చండాలసంసారపా[4]
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం
బ్రవ్యక్తిగా నాత్మలో
నేవం బొందక యేను నీ వనుట తా
నజ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టికుతర్కముం గలదె చిం
తింపంగ సర్వేశ్వరా. 74.

1. విఘ్నము 2. కోరికలు 3. శివుడేనేను 4. సముద్రము.

మ. రసికుండై భవదం[1]ఘ్రిపద్మయుగ మా
రాధించుచో దుర్మద
వ్యసనాటోపము చిక్కులం బొరయుచు
న్వర్తించుచున్నట్టి పా[2]
లసు పూజావిభవం బదొప్పునె మహిన్
లక్షింప నారంభముం
గసువుం బెంచినచేనియట్లఁ దలఁపం
గా మీఁద సర్వేశ్వరా. 75.

మ. అమితోత్సాహము నంది నీకుఁ దనస
ర్వార్థంబులుం గూర్చి నే
మముతో నిచ్చుటకంటె శౌర్యగుణసా
మర్థ్యంబునం జేసి ప్రా
ణము నీకిచ్చుటకంటె దుస్తరభవో
న్మాదంబు మర్దించి చి
త్తము నీకిచ్చుట పెక్కుభంగుల మహా
దార్యంబు సర్వేశ్వరా. 76.

మ. ఘనవైరిప్రకరంబుఁ దాఁకి యనిలో
ఖండించుకంటెన్ మృగేం
ద్రుని జేపట్టుటకంటె దిగ్గజముతో
ద్రోపాడుకంటెన్ మహా

1. పాపములు 2. దుష్టుండు

శనిఁ దా వ్రేయుటకంటె [1]ఘోరభవదు
శ్చారిత్ర వారించి రం
జనతోఁ జిత్తము శిక్షసేయుట మహా
శౌర్యంబు సర్వేశ్వరా. 77.

మ. అమితామోద నవప్రసూనముల ని
న్నర్చించుచో గద్యప
ద్యము లూహించి నుతించుచో వివిధ గీ
తవ్రాతము ల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణుఁడై
యాటాడుచో నందు జి
త్తము సద్భక్తియె నీవుచేకొను పదా
ర్థంబెల్ల సర్వేశ్వరా. 78

మ. కడుఁజిత్రంబుగఁ జేయంగా నొఱ సురం
గంబయ్యెనే ఖడ్గముం
దిడకున్నం జెడు రూపదేమి కఱ[2] దా
నిం జెక్కు పాటింపఁగా
నొడ లెబ్బంగుల నొప్పునే నియతితో
నూహించి నిన్నాత్మలో
నిడకున్నం జను రూపు నేమికొఱ తా
నీక్షింప సర్వేశ్వరా. 79.

---

1. సంసారము 2. ప్రయోజనము

మ. జ్వరసంతాపవిశోషితాంగుఁడు సుధా
సం[1]కాశ దివ్యాన్న పా
న రసశ్రేణి భుజింప రోయుగతి ను
న్మాదేంద్రియ[2]ధ్వాంత దు
స్తర సంసార మదప్రమత్తుఁడు మహా
సౌఖ్యోత్సవంబైన మీ
చరణారాధనయందు బుద్ధిఁ జొనుపం
జాలండు సర్వేశ్వరా. 80.

మ. కలయం గాష్ఠయుగంబుఁ గూర్చి తరువం
గాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటిన్ దహియించువహ్నిగతిఁ దాఁ
బొల్పొందఁ గాయంబు సం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవ
చ్ఛిద్భక్తి సద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ ద
త్త్వం బెన్న సర్వేశ్వరా. 81.

మ. స్థిరబుద్ధిం దనసొమ్ము భక్తవరసు
క్షేత్రంబునన్ [illegible]
పరఁగంగా వెదపెట్టి మీఁద నతిసం
పన్నుం డగుఁగాక దా

1. సమానము 2. చీకటి

నరిషడ్వర్గముపాలుసేసి భవమా
యాగ్రస్తుఁడై యిచ్చు నె
వ్వరి వేఁడం జనువాఁడొకో విషయ దు
ర్వ్యాపారి సర్వేశ్వరా. 82.

శా. కాయంబన్నది వారిబుద్బుదసదృ
క్షంబందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటి[1]
త్ప్రాయంబు సంపత్సుఖ
శ్రేయం బన్నది మాయ యిట్లెఱిఁగియున్
శ్లాఘింపఁ నీధ్యానసం
స్థాయీభావనఁ బొందఁ డేమిటికయో
సంసారి సర్వేశ్వరా. 83.

మ. భవదీయస్థిరభక్తిలబ్ధియు భవ
ద్భక్తైకగోష్ఠీమహో
త్సవలీలావిభవంబు నీయచలిత
ధ్యానానుమోదంబు లో
నివి నిత్యస్థితు లారయంగ విధి దే
వేంద్రాదిభూతాఖిలో
త్సవ భోగస్థితులెల్ల మిథ్యలవి త
త్త్వం బెన్న సర్వేశ్వరా. 84.

1. మెఱుపు.

మ. తనయుక్తి న్భవదంఘ్రిపంకరుహస
ద్భక్తుండు పాపంబు చే
సినఁ బుణ్యంబగు భక్తిహీనుఁడు శ్రుతు
ల్చేపట్టి పుణ్యంబుచే
సినఁ బాపంబగు దీనికింతయును జ
ర్చింపంగఁ జండీశ్వరుం
డును దక్షుండును సాక్షులెన్న నగరా
ట్కోదండ సర్వేశ్వరా. 85.

శా. ప్రారంభించి చకోరపోతము మహా
యజ్యోత్స్నయం దుత్సవ
శ్రీరంజిల్లుచు సోలుచుండుగతి నా
చిత్తంబు నీదివ్యశ్రీం
గారధ్యానమునం దహర్నిశముం జొ
క్కంజేయవే దేవ శ్రీ
గౌరీలోచననర్తకీనటనరం
గస్థాన సర్వేశ్వరా. 86.

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి త
త్తజ్జాతితోఁ బండ్లగున్
హర మీపాదపయోజపూజితములై
యత్యద్భుతం బవ్విరుల్

కరులా నశ్వములా ననర్ఘమణులాఁ
గర్పూరమా హారమా
దరుణీరత్నములాఁ[1] బటీరతరులాఁ
దథ్యంబు సర్వేశ్వరా. 87.

మ. ఒకపుష్పంబు భవత్పదద్వయముపై
నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బున
ర్జన్మంబులేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల ని
న్నర్చించుచున్ బెద్దనై
స్థికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ
జిత్రంబె సర్వేశ్వరా. 88.

శా. ఆనందంబును బొందినప్పుడును న
(న్నాచారచర్యాది) త్వాశ్చర్యకార్యార్థ భా
వాసీకంబులు దోఁచునప్పుడును
రోగాపాయదుఃఖాతుర
గ్లానిం బొంది చరించునప్పుడును స
త్కార్యంబున నీవు నా
ధ్యానంబం దుదయింపుమయ్య దివిజేం
ద్రస్తుత్య సర్వేశ్వరా. 89.

1. మంచిగంధపుఁజెట్టు

శా. నానాశాస్త్రసముచ్చయాగమపురా
ణప్రౌఢులై తత్త్వవి
జ్ఞానధ్యానసమాధివిద్యలతివి
స్పష్టంబుగా నేర్చి నే
దా నీనేర్పుల నెల్ల నొప్పదు భవ
త్సద్భక్తివిద్యాసమా
ధానప్రస్ఫుటశక్తి నీకరుణచే
తంగాని సర్వేశ్వరా. 90.

మ. ప్రకటింపంగ మదీయచిత్తమది దాఁ
బంచేంద్రియోద్వృత్తమై
ప్రకటప్రాప్తిని సోలుఁగాని మఱినీ
పాదాబ్జసంసేవనం
బొకవేళన్ భజియింప నొల్లదు నిజం
బూహింప నెట్లన్న నీఁ
గకు దుర్గంధముగాక సహ్యమగునే
కస్తూరి సర్వేశ్వరా. 91.

మ. మలినాంగుండగు టేమికష్టము మనో
మార్గంబు నీభక్తి ని
ర్మల సౌభాగ్యనిధాన దీపశిఖనై
రంజిల్లదే భూపణో

జ్వలదేహుం డగు శేమి తేజము మనో
వ్యావృత్తి దుర్మోహచం
చలదుష్కర్మతమంబు వీడఁబడునే
చర్చింప సర్వేశ్వరా. 92.

మ. ఇల నాచిత్తము యోగసాధనలయం
దీఁదాడఁగాఁ గొంతని
శ్చలతం జేరఁగవచ్చు లేక తన వాం
ఛావృత్తిఁ బోనిచ్చినం
బలుపై నీదెసఁ జేర దట్టి దకటా
భావించినంగాక కే
వలసంబోధన నేలనిల్చు ఋజువై
వర్తిల్లి సర్వేశ్వరా. 93.

మ. ఉదకంబింకిన లావుదూలివడిఁ దా
నుష్ణింపంగా రొంపిలోఁ
గదలంజాలని మీను వాన గురియం
గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ
బాదలంగన్న విధంబునన్ భవములోఁ
బొర్లాడు మర్త్యుండు దా
హృదయాబ్జంబున నిన్ను నిల్పఁగనునే
యింపొంద సర్వేశ్వరా. 94.

మ. భవదీయార్చనసేయుచోఁ బ్రథమపు
　　ష్పంబెన్న సత్యంబు రెం
డవపుష్పంబు దయాగుణం బతివి
　　శిష్టం బేనిష్టాసమో
త్సవసంపత్తి తృతీయపుష్ప మది భా
　　స్వద్భక్తి సంయుక్తియో
గవిధానం బవిలేని పూజలు మహిం
　　గైకోవు సర్వేశ్వరా. 95.

మ. అమరేం[1]ద్రాద్రి శరాస[2]నంబు హరి ది
　　వ్యాస్త్రంబు భూమండలం
బమరంగా రథ మర్కచంద్రములు తదీ
　　యాగంబులై యొప్పఁ జి
త్రమె నీకుం బురలక్ష్య మేయునెడ ను
　　ద్యద్భాతి నత్యల్పకా
ర్యములం దైనను దా మహాఘనము నీ
　　యత్నంబు సర్వేశ్వరా. 96.

మ. ఘనేంద్రత్వముఁ బద్మజత్వము జగ
　　త్సేవ్యస్థిరానర్గళో
ద్యూపం బగు కేశవత్వమును నీ
　　సద్భక్తి సంవృద్ధిలో

1. మేరుపర్వతము 2. విల్లు.

లవమాత్రస్థితు లెన్న భక్తిజనితో
ల్లాసావనోద్యత్సుఖా
ర్ణవ సౌభాగ్యప్రమాన మెవ్వరికిఁ జె
ప్ప న్వచ్చు సర్వేశ్వరా. 97.

మ. పరమార్థంబుగ నామనంబున భవ
ద్భక్తిప్రభావంబు వి
స్తరమై పుట్టదు పుట్టినం బ్రబల దం
తం గొంతవర్థిల్లెనే
విరసంబై యటమీఁదఁ జిక్కువడుఁ దా
వేవేగ నెట్లన్న న
స్థిరుఁడంగాన జడుండఁగాన బక వే
షింగాన సర్వేశ్వరా. 98.

శా. శ్రీకంఠాయ నమోనమో నతసుర
జ్యేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమోనమో విగతసం
సారాయ తారార్కచం
ద్రాకల్పాయ నమోనమో దురితసం
హారాయ తే యంచు ని
న్నాకాంక్షం బఠియించు మానవుండు నీ
వై యుండు సర్వేశ్వరా.

మ. భువనోత్పత్తి విధించుచో భవుఁడవై
        పాల్పొందఁగా దాని ను
    త్సవలీలం బ్రభవించుచో మృడుఁడవై
        సర్వంబుఁ గల్పాంతభై
    రవసంక్షోభ నటించుచో హరుఁడవై
        త్రైగుణ్యశక్తిం దుదిన్
    శివనామాంకముఁ దాల్చు నీమహిమ దాఁ
        జిత్రంబు సర్వేశ్వరా. 100.

మ. కులశైలంబులు పాదు పెల్లగిలి దిక్
        కూలంబునం గూలినం
    జలధుల్ మేరల నాక్రమించి సముదం
        చద్భంగి నుప్పొంగినన్
    జలజాతప్రియ శీతభానులు యథా
        సంచారము ల్దప్పినం
    దలఁకం డుబ్బఁడు చొప్పుఁదప్పఁడు భవ
        ద్భక్తుండు సర్వేశ్వరా. 101.

శా. శూలస్థాపితుఁడైన మానవునకున్
        శూలంబు దుర్వారహా[1]
    త్యాలిం గంపము నొందకుండుట సుఖం
        బై తోఁచుమాడ్కిన్ భవా

---

1. గాలుల సముదాయము

భీలజ్వాలలఁ గ్రాఁగు మానవునకున్
బింబాధ[1]రా హార వ
స్త్రాలంకారము లించుకించుక సుఖం
బై తోఁచు సర్వేశ్వరా. 102.

శా. ఆకాశానల చంద్రసూర్య పవమా
నాత్మాంబు విశ్వంభరా
ప్రాకామ్యాంచిత మూర్తిభేదముల నీ
బ్రహ్మాండ నానాఘటా
నీక ప్రాకట జీవభావ విలస
న్నిర్మాణ కర్మాద్భుతా
స్తోక శ్రీకరమూర్తియై నెగడు నీ
స్థూలంబు సర్వేశ్వరా. 103.

మ. అతివాఙ్మానసమై యజాండనిలయం
బై యాదిమధ్యాంతవ
ర్జితమై నిర్గుణనిష్కలంకపదమై (శీలోత్తమాధ్యాత్మ)
సిద్ధాంత మధ్యాత్మసం
యుతమై కోటిరవిప్రకాశయుతమై
యోంకారమంత్రాది సం
స్తుతమై యెంచ నచింత్యమై వెలుంగు నీ
సూక్ష్మంబు సర్వేశ్వరా. 104.

1 యువతి.

మ. అజుఁడై సృష్టియొనర్చు రాజసమునం
దండంబుగాఁ దా నధో
క్షజుఁడై వర్ధిల్లఁజేయు సాత్త్వికము సం
ప్రవ్యక్తిగా గోపతి
ధ్వజుఁడై సంహృతిసేయుఁ దామసమునం
దత్సర్వముం గూడఁగా
నిజవిస్ఫూర్తి వెలుంగుఁ దుర్య[1]మగుచున్
నీయాజ్ఞ సర్వేశ్వరా. 105.

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భి
క్షాగామి వత్యంత శాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌం
దర్యాంబికా సంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం
దెల్లంబుగా నెట్టి వా
రికిం దా శక్యమె నీనిజం బరసి చ
ర్చింపంగ సర్వేశ్వరా. 106.

మ. భవదుఃఖార్ణ[2]వయానపాత్ర[3]ము పర
బ్రహ్మంబు యోగీంద్ర హృ
ద్భవన ప్రస్ఫురితప్రదీపము లయ
ధ్వాంతార్కబింబం బతి

1. నాల్గవది. 2. సముద్రము 3. నావ.

శ్రవణానందకరంబు సన్మునిగణ
స్వాధ్యాయసారంబు మీ
శివనామాంకము భక్తపుంగవసదా
సేవ్యంబు సర్వేశ్వరా. 107.

మ. అణిమాద్యష్టగుణప్రసిద్ధులు త్రిలో
కారాధ్యు లుద్యద్ద్యుచో
మణికోటి ప్రతిమప్రభాపటలు లు
న్మాదేంద్రియధ్వాంత భీ
షణ దైత్యేంద్ర వినాశకారణ మహా
శౌర్యోన్నతు ల్లోకర
క్షణదక్షుల్ వినుతింప నీప్రమథసం
ఘాతంబు సర్వేశ్వరా. 108.

మ. సకలాధీశ్వరులై గణాధిపతులై
సర్వజ్ఞులై నిత్యులై
యకలంకాత్మకులై మహామహిములై
యంభోజగర్భాండ ర
క్షకులై యుండుదు రెల్లవారును భవ
త్సద్భక్తి నానాగణా
ధిక లీలావిధి నంతరంగముల వ
ర్తింపంగ సర్వేశ్వరా. 109.

మ. అమరేంద్రాబ్జభవాచ్యుతాదులకు నీ
యాజ్ఞాప్రభావం బలం
ఘ్యము నీకున్ భవదీయభక్తమహదా
జ్ఞాపంబు నుదగ్రప్రభా
వము లోకంబులలో నలంఘ్యమగుట
న్వర్ణింపఁగా నీ మహా
త్త్వముకంటెం గడుఁ జెల్లు భక్తులమహా
త్త్వం బెన్న సర్వేశ్వరా. 110.

మ. శివసాహిత్యు లసత్కరస్థలము కా
శీక్షేత్ర మాహాత్తదే
శ విశాలోన్నతశాఖ లారయఁగఁ బం
చక్రోశ మాపాణి సం
భవ శోభాన్విత చిత్రరేఖలు మహా
భాగీరథీతీర్థముల్
శివలింగంబుల విశ్వనాథుఁ డరయన్
సిద్ధంబు సర్వేశ్వరా. 111.

మ. వరుసం బైకొనివచ్చు కర్మముల ము
న్వారించి మాయామల
జ్వరము ల్దూల్చి యపార ఘోరతరసం
సారాబ్ధి లంఘించి భీ

కర సూక్ష్మాంగ విచిత్రకంచు[1]కము వీఁ
    కం బుచ్చిపోవైచి తాఁ
బరమవ్యోమ[2]ము సొచ్చు నీయచలస
    ద్భక్తుండు సర్వేశ్వరా. 112.

మ. పరమార్థంబగు తత్త్వమారయఁగ నీ
    పాదాబ్జసద్భక్తుఁ డొ
క్కరుఁడుండక్క సరోజజాద్యమర సం
    ఘాతంబులోనెల్లఁ దా
నెరయం గాచికొనంగఁజాలరు మహా
    నిర్భీకుఁడున్ లేఁ డతి
స్ఫురణం గాలుఁడు దన్ను వేచి వడిఁ గొం
    పోనుండ సర్వేశ్వరా. 113

మ. తనచారిత్రము తత్త్వవేత్తలగు భ
    క్తశ్రేణి వర్ణింపఁగాఁ
దనచిత్తంబు భవత్పదస్మరణచే
    తన్నిన్ను మెప్పింపఁగా
ననుకూల స్ఫుట నిష్కలంక బహిరం
    గాభ్యంతరంగ స్థితి
స్వినుతిం బొందిన తజ్జ్ఞుఁ డీజగములో
    నీమెచ్చు సర్వేశ్వరా. 114.

---

1. చొక్కా  2. చిదాకాశము

మ. క్షితి నత్యుగ్రతపంబునందు జటరా
గ్నిం గ్రాఁగఁగానేల మి
మ్మతి భక్తిస్థితిఁ బూజసేయుమహనీ
యత్వంబు తాఁ జాలదే
ప్రతిపక్షాలినడంప రోగభవదు
ర్భారంబు వారింప న
ద్భుతసౌభాగ్యముఁ బెంప దివ్యసుఖముం
బొందింప సర్వేశ్వరా. 115.

మ. శివవాక్యస్ఫురితాక్షరద్వయ సకృ
జ్జిహ్వాప్రదేశాత్ముఁడై
భవదుఃఖాంబుధి దాఁటునన్న మఱి ద
త్పంచాక్షరీమంత్ర ము
త్సవలీలం గడుశుద్ధుఁడై జపము వాం
ఛంజేయు భాస్వద్గుణా
ర్ణవ సౌభాగ్యముమానమెవ్వరికిఁ గా
నన్వచ్చు సర్వేశ్వరా. 116.

మ. అరిషడ్వర్గ[1]బలంబులో మలసి మా
యావృత్తి నాయందతి
స్ఫురణం జేసినవాఁడు మోహుఁ డతనిన్
బోఁద్రోచి నీభక్తితోఁ

---

1. కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యములు

బరఁగం గూర్చి వివేకిఁ జేసి నెరయం
బాటించి నాయందధీ
శ్వరుఁడై యుండఁగదయ్య రౌప్య[1]కుధర
వ్యాపార సర్వేశ్వరా. 117.

మ. అమలామ్నాయనిధిప్రబోధము లసం
ఖ్యాతంబులై యుండు నా
గమమార్గోత్తమమంత్రతంత్రము లసం
ఖ్యాతంబులై యుండుఁ ద
త్క్రమమున్ నా కవియేల నీవు మెఱయం
గా నిన్ను సద్భక్తియో
గమునం గొల్చి జయింపఁజేయుమిదె మ
త్కామ్యంబు సర్వేశ్వరా. 118.

శా. ఏదేశంబున నేదిశాముఖమునం
దేయూర నేవాడ మీ
పాదాభ్యర్చనసేయునిర్మలుఁడు స
ద్భక్తుం డొకం డుండెనా
యాదేశంబును నాదిశాముఖమును
న్నాయూరు నావాడ గం
గాదిస్నాననదీప్రవాహఫలదం
బైయుండు సర్వేశ్వరా. 119.

1. వెండికొండ

మ. ఒనరం జిత్తముశుద్ధిలేనినరుఁ డు
ద్యోగంబునం గోరి చే
సిన పూజావిభవంబు సువ్రతములున్
శీలంబులు స్మంత్రసా
ధనముల్ తీర్థములుం దపంబులును మీఁ
దం జెట్టవాఁడభ్యసిం
చిన శస్త్రాస్త్రకళావిభంబులగుఁ జ
ర్చింపంగ[1] సర్వేశ్వరా. 120

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహం
కారంబుఁ జిత్తంబు నా
యమలాంతఃకరణంబు నక్షరచతు
ష్కావాప్తిఁగాఁ దీర్చి పం
చమ వర్ణంబుగ నాత్మఁ గూర్చి కడు వాం
ఛన్ యోగి పంచాక్షరీ
సుమహన్మంత్రముతోడ నైక్యపదవిన్
శోభిల్లు సర్వేశ్వరా. 121.

మ. భవదీయాననపంచకంబువలనం
బంచాక్షరశ్రేణి యు
ద్భవమై తత్పదవర్ణపద్ధతుల శుం
భత్పంచభూతంబులు

1. సమానము.

ద్భవనంబై యఖిలంబుఁ బుట్టినను లస
త్పంచాక్షరీమంత్ర మీ
భువనాండంబులఁ దల్లియై శుభములం
బొందించు సర్వేశ్వరా. 122.

మ. పటుశాస్త్రాగమదృష్టి నివ్విధమునన్
భావించి వీక్షించి యు
ద్భటవృత్తిన్ భవదీయభక్తినికర
బ్రహ్మాండకుండైన నా
దట లోఁగాచుకొనంగవచ్చు విదిలో
ద్దండప్రతాపోత్కట
స్ఫుటకోపానలమూర్తియై యముఁడు కోం
పోకుండ సర్వేశ్వరా. 123.

మ. కలవారై మతిమంతులై రసికులై
గంభీరులై ధీరులై
లలనామన్మథులై సముజ్జ్వలవచో
లాలిత్యులై నిత్యులై
బలవిభ్రాజితులై యశోభరితులై
భాసిల్లు భాగ్యోదయుల్
తొలిజన్మంబుల మిమ్ముఁ గొల్చినమహా
త్ముల్ వారు సర్వేశ్వరా. 124.

మ. ఖలులై యాచకులై విరుద్ధవికటా
కారాంగులై పం[1]గులై
బలహీనాతురులై రుజాపటలతోఁ
బచ్ఛన్నులై ఖిన్నులై
చలనాందోళితచిత్తులై మలినులై
జామ[2]న్యులై శూన్యులై
యిల జన్మింపుదు రాత్మ నిన్నిడని వా
రీక్షింప సర్వేశ్వరా. 125.

శా. ఏయే వేళల నేవయస్సున నరుం
డేభూమి నేయూరిలో
నేయే కర్మము నాచరించు నశుభం
బేని న్శుభంబేని దా
నాయా వేళల నావయస్సున నరుం
డాభూమి నాయూరిలో
నాయా కర్మఫలంబు జెల్లఁ గుడుచున్
దానొంద సర్వేశ్వరా. 126.

శా. ఆడం బోయినచోట బాలురు వినో
దార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచుఁ బే
రో[illegible]న్నంతటంజేసి వా

1. కుంటివారు, 2. నీచులు.

రాడంబోయి సురాంగనాకలిత
దివ్యారామ చింతామణి
క్రీడాశైలవిహారులై వెలయుటల్
గీర్తించు సర్వేశ్వరా. 127.

శా. కానీదారసమన్వితుండు మిగులం
గానీఁడు కందర్పునిన్
గోనీ మానవకోటిలో మరులు బై
కోనీఁడు మోహంబునున్
రానీ రాజితరాజ్యవైభవము పై
రానీఁడు గర్వంబునున్
లోనీవైనమహాత్ముఁ డన్యమునకున్
లోనీఁడు సర్వేశ్వరా. 128

మ. తమలింగార్చనకంటె జంగమము సాం
దర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తిస్థితి లింగజంగముల
న్సామ్యంబుగాఁజేఁతమ
ధ్యమభక్తస్థితి లింగపూజనధికం
డై జంగమోపాసనా
ధముఁడై యుండుట భక్తియందది కని
ష్ఠత్వంబు సర్వేశ్వరా. 129.

శా. శాకాబ్దంబులు వార్ధిషట్క[1] పురజి
త్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతో
శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁజెప్పె శుభకృ
త్ప్రవ్యక్తవర్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం
జెన్నొంద సర్వేశ్వరా. 130

మ. అభిరమ్యంబుగ దూదికొండ మహానీ
యారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్య వసంతసంజనిత (మత్పద్య) మ
ద్వాక్యప్రసూనావళి
న్విభవం బొప్పఁగఁ గూర్చి యెంతయు లస
ద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవంబైన భవత్పదద్వయము నా
రాధింతు సర్వేశ్వరా. 131.

శా. ఏ నిన్నే శరణందు బాంధవులుగా
నీ యెల్లవారుం బగే
కానీ మృత్యువు తల్లఁక్రిందువడనీ
కాలుండు గీవెట్టనీ

1. సముద్రము, 4. షట్క, 6. పురజిత్ రుద్రులు, 11. తిరుగవేయగ

నానాకర్మచయంబు గింజుకొనసీ
నాకేమి నేరాజ నిం
తే నీచాటున దాఁగియున్నపుడు భీ
తే యింక సర్వేశ్వరా. 132.

శా. ధాత్రి న్భక్తజనానురంజనముగాఁ
దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా
సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా
శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయచెప్పె నిజ్జగములోఁ
శోభిల్ల సర్వేశ్వరా. 133.

శా. బాలుం డాడెడుమాటలెల్ల నుపమిం
పం దండ్రికిం బ్రౌఢభా
షాలాపంబులకంటె మించుగతి నే
నజ్ఞానభావంబునం
దాలోచించి రచించినట్టికృతి యిం
పారంగ నీకు న్మహా
లాలిత్యస్తుతికంటెఁ గైకొనుఁగదా
శ్లాఘ్యంబు సర్వేశ్వరా. 134.

మ. పరమార్థంబుగఁ దత్త్వము న్నెఱుఁగనో
ప్పం దీర్చి డెందంబు నీ
కరుణాస్థానముఁ జేర్చలేక తనవం
కం బాఱిపోనిచ్చి రే
నరకాబ్ధిం బడవైచుఁ దద్గుణములో
నం గానఁ దత్త్వక్షమం
బరయం జిత్తము[1] శూకలాశ్వము నిభం
బైయుండు సర్వేశ్వరా. 135.

మ. భవదంఘ్రిద్వితయార్చనంబును భవ
త్ప్రఖ్యాత సద్భక్తపుం
గవ గోష్ఠీవిభవంబు నీవిమలసూ
క్ష్మధ్యానయోగంబు నా
నివి సంపూర్ణసుఖంబులెన్న మఱి దే
వేంద్రాదిభూతాఖిలో
త్సవసంబంధములెల్ల దుస్స్థితులు త
థ్యం బెన్న సర్వేశ్వరా. 136.

మ. సమయోద్భిన్నసహస్రపంకరుహపూ
జాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవ
త్పాదంబు లర్పించి చ

1. దుష్టాశ్వము.

క్రము నీచేఁ గొని దైత్యకోటి ననిలో
ఖండించెఁ దా నీపద
క్షమతాసేవ సమస్తదేవతలకు
త్సత్త్వంబు సర్వేశ్వరా. 137.

మ. అమర న్వేదపురాణశాస్త్రములు ము
న్నాకాంక్షఁ దత్త్వప్రభే
దము లూహింపఁగ నేరవన్న మఱి యా
తత్త్వంబులెట్లన్న ను [భక్తస]
త్తమసంతోషమె కోరు(నిన్నెపుడును) నేని
నరుఁ డుత్సాహించి నీ (భక్తిను)
త్తమసంతోషమొనర్చునే నతఁడు త
త్త్వజ్ఞుండు సర్వేశ్వరా. 138.

మ. అమితోద్యద్భవదీయతత్త్వము మహీ
యస్తోత్ర వాణీవిలా
సములై యొప్పు సమస్తవేదములు శా
స్త్రశ్రేణియున్ దివ్యవి
భ్రమవాదంబులు నెన్నిచూడ నివి నీ
పంచాక్షరీమంత్రభా
వములై యుండు సమస్తలక్షణముల
న్వర్ణింప సర్వేశ్వరా. 139.

శా. సంకీర్ణాకలితాక్షరత్రయము భా
స్వన్నాదబిందుక్రమా
లంకారద్వితయంబుతోఁ గలసి లీ
లన్ దివ్యయోగీంద్రహృ
త్పంకోద్భూతములందు రూఢమగుచుం
బంచాక్షరీమంత్రమ
య్యోంకారాత్మకమై లసన్మునిగణం
బూహింప సర్వేశ్వరా, * 140.

మ. అమలజ్ఞానవికాసభాసురత న
య్యష్టాంగపూజావిధి
క్రమయోగంబుల నిన్ను నెల్లపుడు జో
కం గొల్వంగా నేల ని
క్కము నీభక్తులగోష్ఠి చాలుఁ గడువీఁ
కన్ ఘోరసంసార దుః
ఖములెల్లం బెడవాపి నిన్ను వెలయం
గాఁ జూప సర్వేశ్వరా. 141.

* చూడుపీఠిక.

మ. జయశక్తి గ్రహచంద్రతారకముగాఁ
జల్పెన్ యథావాక్కులా
న్వయసంజాతుఁడు నన్నమార్యుఁ డవని
న్వర్ణించి నీసత్కథా
క్రియ సంబోధన నీదుభక్తిని మహా
నిర్ణీతవిశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక యీశతకముం
బ్రఖ్యాతి సర్వేశ్వరా. 142

సర్వేశ్వరశతకము సంపూర్ణము.



